# తెలంగాణ మంత్రి

తెలంగాణ మంత్రి ఒకడు
బివి గురుమూర్తి పేరు
రాజినామా ఇచ్చి
బైటికి వచ్చిండు నేడు.

ఆలస్యంగా నైతేనేమి
బుద్ధి వచ్చినది వానికి.
ప్రభుత్వ అత్యాచారము
బోధ పడెను నేటికైన

తెలంగాణ ప్రజలమతము
కేంద్రమంత్రుల కన్న
సూక్ష్మ బుద్ధి అన్న మాట
తక్కిన మంత్రులు ఎప్పుడు
రాజీనామా ఇస్తారో
వేచి చూడవలసివుంది.

తెలంగాణ వీర ప్రజలు
ఉద్రిక్తులు, ప్రాణిధర్మ
ఆక్రోశము ఏమంటదో
చూడాలే వేచి చూడాలే.

బివి గురుమూర్తిని
క్షమతో చూచిన మంచిది.
తక్కిన మంత్రులు కూడ
బైట పడితె మరి మంచిది.

ప్రజలు అమాయకులు వారు
ద్రోహమంత మరుస్తారు.
మంత్రులు ముందుకు వచ్చి
లెంపలేసుకుంటె చాలు.
తెలంగాణ వస్తున్నది.
తెలంగాణ వస్తున్నది.
బ్రహ్మానందుని బడాయి.
రూపుమాసిపోనున్నది
నిజలింగమ్మపకు చెప్ప.
దెబ్బ తగిలినట్లున్నది.
--
జూలై నెల తెలంగాణ
మొదటి నెల కానున్నది.
ఇందిరమ్మ వచ్చెలోగ
కేంద్రము కొంపమునగ
కుండ చూచుకొను బాధ్యత
మురార్జీ, చౌహాన్లది
కాడెద్దుల గుర్తుమాసి

పోకుండ చూచుకునే
బాధ్యతలిపుడు కేంద్రానిది.
జైహింద్ జై తెలంగాణ

తెలంగాణ జిందాబాద్.

## ప్రజాస్వామ్య పద్ధతిలో

ప్రజలు కాదను ప్రభుత
నిలుస్తుంద? నిలువదు
తెలంగాణ ప్రజలు నేడు
ఏ పార్టీతో కలిసున్నారు.
అందగనున్నది నేడు.
ప్రజల మతము కాదనుచు
కాడెద్దులు, కామరేడ్లు
జన సంఘములు, యస్.పి
పి.యస్.పి. ఇత్యాదులు
సమైక్యాంధ్ర నినాదాల
సన్నాయిలు ఊదుతాన్రు.
ఇతైహాదు నాయకులు
కుత్తుకతో పొత్తులేదు.
సామాన్యులు అయిన తురక
ప్రజలందు ప్రజాసమితి

అందుకె అంటాను నేను
ప్రజాస్వామ్య పద్ధతిలో
తెలంగాణకే విజయము
పార్టీలన్నియు మాసై
మాయుసేమో మాస్తె
మాయుసేమో కాని తుదకు
వచ్చి తీరు తెలంగాణ
భారతమాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## స్వతంత్ర పార్టీ తప్ప

స్వతంత్ర పార్టీ తప్ప
తక్కిన పార్టీలన్ని
కాడెద్దుల పక్షమునే
కాపాడుతు వున్నాయి.
తెలంగాణ పేర్పాటును
వ్యతిరేకస్తున్నారు.
పార్టీ నాయకత్వాలే
తెలంగాణ వ్యతిరేకము
అనుచరులందరు కూడ
తెలంగాణ అభిమానులె
ప్రజల మతము తెలంగాణ

పక్షాన ఉన్నపుడు
నాయకత్వ ప్రగల్భాలు
అడ్డును గమ్యము చేరగ
భారతమాతాకీ జై

తెలంగాణ జిందాబాద్.
ప్రజాస్వామ్య పద్ధతిలో
ప్రజాస్వామ్య పద్ధతిలో
ప్రజలు కాదనెడు పార్టీ
రాణించున? రానించదు

## దామోదర సంజీవుడు

దామోదర సంజీవుడు
నేడు మళ్లి ఢిల్లీలో
చౌహాను, మురార్జీల
దర్శనంబు చేసుకొని
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విషయంలో
ముచ్చటించినాడంట.

రోము నగరు కాలుతంటె
నీరోఫిడేలు, వాయిద్యము
బెంగుళురులో అప్పుడు

తెలంగాణ అలజడంత
ఆపివేయమని ప్రజలను
మరోసారి కోరిందట.

బ్రహ్మానందుడు ముమగ
మళ్లి నోరు ఎత్తిండట
రాజ్యంలో శాంతి తాను
నెలకొల్పగ వున్నాడట.

కేంద్రమేమో తెలంగాణ
క్షేమానికి హామీ అట
అలజడంత అదుపులోకి
తెచ్చి, అప్పగిస్తాడట.

కేంద్రము తెలంగాణ ప్రజకు
క్షేమము చేకూర్చునట,
చిలిపిచేష్ట దగాకోరు
చిలుక పల్కు పల్కుతాడు.

తూటాలతో పల్కుతాండు
కోటలో కూర్చిండి తాను
చావు ప్రగల్భాలు పలికి
జనతను బెదిరిస్తాండు.

రెండు మూడు రోజుల్లో

తేలిపోవు అటో ఇటో

కేంద్రపాలన సైతము పనికి రాదు.

మనకిప్పుడు తెలంగాణ

ప్రత్యేక తెలంగాణ తప్ప

వేరు మందు లేదు రోగానికి

గరళము పోసే సమయం

కూడ దాటి పోతాంది.

భారతమాతాకీ జై

తెలంగాణ జిందాబాద్.

## నిజ లింగప్ప అభీష్టము

నిజ లింగప్ప అభీష్టము

తీరుగ బ్రహ్మానందుడు

కేంద్ర సమ్మతము బడిసి

తెలంగాణలో శాంతిని

నెలకొల్పగ ఉద్యుక్తుడు.

బ్రహ్మానందుడు శాంతిని

నెలకొల్పిన తక్షణంబె

కేంద్రము తెలగాణీయుల

క్షేమమరయ నున్నదట
బ్రహ్మానంద ఉవాచ.

నాయకులను రాజమండ్రి
జేలులో పడవేసినంత
వచ్చిందా బ్రహ్మన్నకు
ఈ పాటి బలము ధీమ.

తెలంగాణ అలజడంటె
నాయకులేనా ఏమిటి?
బ్రహ్మన్న బడితె బాట
బట్ట బైలు పడనున్నద?

ప్రజల రెచ్చి పొయ్యేందుకు
బ్రహ్మానందుని బడితె
మరో సమిధికానున్నద?
మళ్లి హింసకాండ రేగి
పోవాల్నని ప్రభుత్మంబు
చాలు బాజి ధోరణితో
ముందుకు మళ్లొస్తున్నద?

ఈ సారి ఓట్ల సెదుర
షాట్లకె పని పెట్టారట

మూడో జూన్ నాటి నుండి
తూటాలతో సిద్ధంగా సైనికులు
ఉన్నారట. వారికిపుడు
చేతులనిండా పని.

ప్రజలు కూడా సిద్ధంగా
ఉన్నారు ఎదిరి నిల్వ
చేత ఏమి లేని జనత
చేత కానిదా కాదు.
పాణాలొడ్డైన తుదకు
ధ్యేయము సాధిస్తారు.

జాతిపిత శత జయంతి
సంవత్సర సంబరాలు
ఓట్లకు షాట్లకు సమరం
ఈ దెబ్బకు భారతాన
కాడెద్దుల గుర్తు మునుగు.

పార్టీ రాజకీయాలకు
కాలూనే చోటుండని
ప్రజాస్వామ్మ రాజ్యాంగం
రాణించే శభదినాలు

రానున్నవి. రానున్నవి.
దాని కొరకు ప్రజాస్వామ్య
వ్రతనిష్ఠులు తెలంగాణ
పౌరుల ప్రాణాలు బలి
అయితే అయితాయి.

కాని కాడెద్దులు
వృషభాసుర బలగాలు
రూపు మాసి పోతాయి.
సిండికేటు మటుమాయం
కానున్నది కానున్నది.

ఆరి పొయ్యే దీపము వలె
కాంగిరేసు వెలుగుతాంది.
భారతామాతాకీ జై.
తెలంగాణ జిందాబాద్.

## ప్రత్యేక తెలంగాణ అంటే

ప్రత్యేక తెలంగాణ అంటే
పక్కలిరగ తన్నేందుకు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాన్ని

అధికారము ఎక్కడిది?

ప్రజాస్వామ్య రాజ్యాంగం
పరిపాలన గల దేశము
ప్రజామతము ప్రకటిస్తె
పట్టికొట్టి చంపేస్తద?

వేలు లక్షలు ప్రజలు
జేలుకేగ సిద్ధపడితె
ఏర్పాట్లు చేయలేక
లారీÄచార్జి పరిపాలన?
కాడెద్దుల ధోరణిలో
కూడని పనియే లేదా?

విసిగి వేసారి జనం
హింసకాండ తలబెడితె
కేంద్రానిది బాధ్యతంత
'ప్రెస్టేజి' పేర హింస
ప్రభుత్వాన్ని సబబైతె
ప్రాణిధర్మ హింసకాండ
ప్రజలకు కూడా సబబే.

బ్రహ్మాన్న చంపు చంపు

ఏ పాటి చంపుతావో
తూటాలు ఎన్నున్నయో
  పల్చుకో, ఆబాలం గోపాలం
చంపు చంపు చంపు అనుచు
బరి రొమ్ములతో బజార్లో
తూటాలను ఎదురుతాన్రు.

ఒకటో రెండో వుంచకో
తుదకు ఆత్మహత్యకైన
అక్కరకొస్తె నీకు, లేకుంటే
ప్రాణాలతో ప్రజల చేతికే
చిక్కితే నీకున్నది కుక్కచావు.
తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త
భారతమాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## కేంద్రరాజ్య ప్రభుత్వాలు

కేంద్రరాజ్య ప్రభుత్వాల
నడుపుచున్న కాడెద్దులు
అనుకుంటున్నె పాపము
తెలంగాణ ఉద్యమాన్ని
అణచివేసి, ఉందామని.

నాయకులను పట్టుకుంటే
అలజడాగి పోతుందని
ఎంత అమాయకత వారిది
అయ్యగారు లేకుంటే
అమాసాగి పోతుందా?

ఉద్యమాన్ని నడిపేది
నాయకులా అసలు కాదు
నడుస్తున్న ఉద్యమంలో
దూకిన వారే అందరు.

తెలంగాణ పేర్పాటును
కోరేది పార్టీకాదు
ఏదో ఒక ముఠాకాదు
తెలంగాణ ప్రజలందరు
కోరేది తెలంగాణ
ప్రత్యేక తెలంగాణ.

తొమ్మిది జిల్లాల ప్రజల
తీవ్రమైన కోరిక ఇది
నాయకులను జేల్లేస్తే
అణగే అలజడి కాదిది.

కోటిన్నర ప్రజలల్లో
ఒక్కడు మిగిలిన సరియే
తెలంగాణ పేరనుచు
అలజడి సాగిస్తాడు.
--

అరుసెల్ల నుండి సాగు
తొమ్మిది జిల్లాలలోని
ఆందోళన అలజడంత
అణిగే దసలేకాదు.

విద్యార్థులు, యన్.జి.వోలు
లాయర్లు, డాక్టర్లు
పట్టభద్రులు, వర్తక
వాణిజ్యపరులు, చిల్లర
బేరగాళ్లు, రైతులు
జానపదులు అందరు
అందరికందరు కోరేది
ప్రత్యేక తెలంగాణ.

పోలీసు సిబ్బంది కూడ
రేపో మాపో విసిగి

తెలంగాణ ఉద్యమంలో
చేరినను చేరవచ్చు.

ప్రజలు వేల లక్షలాది
ప్రజలు రోజు జేలుకేగ
మమ్మంటే మమ్మంచు
ముందుకు వస్తున్నప్పుడు
ఏదో ఓ కొందరిని
పట్టి జేలు కంపినంత
ప్రత్యేక తెలంగాణ
కోరిక ఆగేది కాదు.

తెలంగాణ ప్రత్యేక
తెలంగాణ వెలయుదాక
తెలంగాణ ప్రజలు
ఇటులె అలజడి సాగిస్తారు.
భారతమాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## అఖిల భారత కాంగ్రెస్ ప్రకటన

1. ''భారత విచ్ఛిత్తి చాలు
   అందుపేరు తెలంగాణ

ప్రశ్న లేదు లేసే లేదు

2. ‘ప్రజామతము’ నాకసలే
సమ్మతమ్ము కాని మాట
ప్రజా మతములో ఎన్నడు
నమ్మకము లేదు నాకు
తెలంగాణ పేర్పాటుకు
ప్రజామతము సేకరణము
మాటే ఎత్తుట తప్ప
తెలంగాణ మందే కాదు.
ఎచటైనను ఏ విషయము
నందైనను ప్రజామతము
సేకరణము పనికిరాదు

3. బ్రహ్మానందుడు ఒక్కడు
చాలు, ఆంధ్రానికి మేటి మగడు
విచ్చల విడిగా అతనిని వదిలి
వేస్తె చాలు చాలు, రెన్నాళ్ళలో
తెలంగాణ నదుపులోకి తెస్తాడు.

4. తెలంగాణ ప్రజలారా!
అలజడి విరమించుకోండి’’.

# <u>అరపై డెబ్బై స్టేటులు</u>

అరపై డెబ్బై స్టేటులు
వెలిస్తేమి భారతాన
భారతము ఒకటి, దాంట్లో
రాజ్యాలెన్నుంటేమిటి?

గ్రామ స్వరాజ్యం మేరకు
రాజ్యాల విభజన నుండి
స్థానిక స్వపరిపాలన
గ్రామ పంచాయితి రాజ్యము
రాజ్యాంగము ఒప్పుకుంది.

సౌరాష్ట్ర, విదర్భ, జార్ఖండు
ఉత్తర ఖండము, ఎన్నైతె ఏమిటి మరి.
మైసూరు మాదై
లింగప్ప అబ్బసొమ్ము
కేమైతది? పాటిల్
చౌహాను తాత జాగీరా
విదర్భంటే? తెలంగాణ
కోస్తన్న వలస రాజ్యమా ఏమిటి?

ఎందులకోయీ కూతలు

సమైక్యాంధ్ర నినాదాలు.

దోపిళ్ళకు, రహదార్లు

మాసిపోతే ఎట్లాగని

గజదొంగల బెడద అంతె

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుని

సూక్తి పరంపర గొప్పది.

## అబద్ధాల లింగప్పకు

అబద్ధాల లింగప్పకు

ప్రజామతము అసమ్మతమట

అసలు అట్టి మాటలలో

నమ్మకమే లేదట అతనికి.

సిండికేటు మనిషి అతడు

మొండివాడు, నిజలింగము

దప్ప మరే ధ్యాసలేదు.

హనుమంతయ్యను మింగిన

మేటి అతడు, గులానంద

సన్యాసము పుచ్చుకొనుట
లింగని పుణ్యమెమరి.

అట్టివాడు కాడెద్దుల
మేటి నేడు అఖిలభారత కాంగ్రెస్
అధ్యక్షుడు, బ్రహ్మానందుని
ఆసర, ప్రస్తుత అధినేత
ఏమంటడో విన్నారా?

కాసుబ్రహ్మానంద రెడ్డికి కేంద్రము
విచ్చలవిడి పత్రమిస్తె
రెండు రోజులల్లో అంత
అదుపులోకి తేగలడట.

కాసు బ్రహ్మానంద రెడ్డి ఏమంటడంటె
తానేది పలుకడుఅట
అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడు
పలికినదే తన మతమట

ఎంతటి సహకారవ్రతము
దొంగలు దొంగలు ఊళ్లు
పంచుకొన్న సామెతిది
రుజువు చేయుచున్న ప్రతిభ

ప్రజాస్వామ్య రాజ్యాంగం
పరిపాలన విధానంబు
వహ్వారె కాడెద్దులు.
--
బ్రహ్మనంద విచిత్రపురి
యందేమైనను కావచ్చును
కాడెద్దుల రాజ్యమ్మె
మాసినను మాయొచ్చును.

నైన్‌టీన్ సెవంటీ టూ లో
భారతాన కాడెద్దుల గుర్తు
కూడ కానరాని ఏర్పాట్లను
చేస్తున్నది సిండికేటు.

మేలో ఎన్నిక జరుగు
కొన్నాళ్ళు సిండికేటు పెల్లు
జనరల్ ఆయూబు మాదిరి.
తర్వాత భారతాన ప్రజాస్వామ్య
పరిపాలన. రక్త పాతమూ తప్పదు.
ప్రజలు తూటాలకు గురి అగుట.
తప్పదుమరి హరేరామ హరేరామ
గాంధీ శత జయంతి ఏడు
నైన్‌టీన్ సెక్స్‌నైన్‌లో
ఓట్లకు షాట్లకు సమరం

కాడెద్దుల పుణ్యబలము

భారతమాతాకీ జై

తెలంగాణ జిందాబాద్.

## బద్రీ విశాల్ పీటీ

బద్రీ విశాల్ పీటీ

చెన్నారెడ్డి 'అచ్యుత'

కొండా లక్ష్మణ్ బాపూ

నిర్బంధం, రాజమండ్రి

జైలు వైపు తరలింపు.

బ్రహ్మానందుడు, ఖండూ

భాయీతో సంప్రదింపు

అబద్ధాల లింగప్ప బుకాయింపు

సంజీవరెడ్డి మనకు రాబోయె

ప్రెసిడెంట్ సిండికేటు జిందాబాదు

నలుబది రెండు ఆగస్టు

భారత పౌరుల అలజడి

స్థాయిలో తెలంగాణ ప్రజలు

ఆంగ్లేయుల దమన నీతి

స్థాయిలో రాజ్యం కేంద్రం

ఓట్లకు షాట్లకు సమరం
నైన్‌టీన్ సిక్ట్సీ నైన్‌లో
బాగున్నది బాగున్నది
ప్రజాస్వామ్య భారతము.

సిండికేటు తిరిగి బలం
పుంజుకొని లేస్తొంది
పాటిల్, అతుల్యఘోషు
కామరాజు, సంజీవుడు
అబద్ధాల లింగప్ప
కలిసి ఏలెదురు దేశం.
--
కటిపుల్లీ అయిన సరె
ప్రధానమంత్రి పదవిలో వుంటె
చాలనుకుంటుంది తాను
శ్రీమతి ఇందిరాగాంధీ
జన సంఘం కూడ తోడు
అవుతదట సంజీవరెడ్డి
రాష్ట్రపతి జేయుటకై
సిండికేటు జిందాబాద్.
కనపడితె కాల్చెయ్యి
కొదవలేదు ప్రజలకేమి

# తొమ్మిది జిల్లాల ప్రజలు

తొమ్మిది జిల్లాల ప్రజలు
చేసిన పాపంబేమిటి?
తొమ్మిది జిల్లాల ప్రజలు
కోర్కెలో తప్పేమున్నది?

రాజ్యాంగం ఏ సూత్రము
బట్టి వారిదపరాధము
కేంద్రానికి ఇబ్బంది
కలిగించుట ఒక నేరమా?

కాడెద్దుల వ్యతిరేకత
అన్నది కూడని పాపమా?
పార్టీ హితమును చూడని
వ్యవహారము నేరమా? తప్పా?

సౌరాష్ట్రము, జారఖండు
విదర్భా, యుపి విభజన
మైసూరులో మరో స్టేటు
వెలిసే అవకాశాన్ని

తలపెట్టె అపరాధమా?

రాజ్యాల విభజిస్తె
రాజ్యాంగానికి లోపమా?
తొమ్మిది జిల్లాల ప్రజలు
చేసిన పాపంబేమిటి?

--

తొమ్మిది జిల్లాల ప్రజలు
కోర్కెలో తప్పేమున్నది
కాంగ్రెసు వర్కింగ్ కమిటీ
కాంగ్రెసు పాలన పార్టీ
పార్లమెంటరీ వర్గము
అనుకూలము కాదనుటే
రాజ్యాంగము, ప్రజా
స్వామ్య పరిపాలన
సిండికేటు ఇండికేటు
చేసినదె న్యాయం ధర్మమా?
భారతము కెడెద్దుల పీడ
నుండి బైట పడగ
కాడెద్దుల గుర్తు మాయ
కుండిన దారేలేదా?

కాడెద్దుల ఆస్తిత్వము

అవకతవకల పైనన
సరె అయితే అది కూడ
ఎంతలోన జనులు తలిస్తె
భారతమాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## ఓట్లకు షాట్లకు సమరం

ఓట్లు ఓట్లు తెలంగాణ
ప్రజల ఓట్లు ఒక వైపు
షాట్లు షాట్లు సైనిక బలగం
షాట్లన్నీ మరోవైపు.

ఆంధ్రప్రదేశము కాదిది
బ్రహ్మానంద విచిత్రపురి
సైన్‌టీన్ సిక్స్టీసైన్‌లో
ఓట్లకు షాట్లకు సమరం.

అసలు ఓట్లు ఎన్నున్నై.
ఓట్లేమో తెలంగాణ ప్రత్యేకం
అంటున్నై
షాట్లేమో ప్రేలి పేలి ఓట్లను
మలి పేస్తున్నై.

షాట్లన్నీ ప్రేలి ప్రేలి
ఎన్ని ఓట్లు మలిపేస్తై
షాట్లన్నీ ఒడిసినాక
మిగిలిన ఓట్లే మంటై
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

మిలిటరి అదుపులో రాజ్యం
కంటబడితె కాల్చెయ్యి
అమన్నదె మిగిలిందొక్కటి
అది గూడ చేసి చూడు
కాడెద్దుల బసవన్న
అది గూడ చేసి చూడు
కడకు నీపెమిగలకుండ
పోతవు అది ఒకటి నిజము
భారతమాతాకు జై
తెలంగాణ జిందాబాద్.

# హైద్రాబాదు వీధుల్లో

హైద్రాబాదు వీధుల్లో
వేలకొద్ది తెలంగాణ
వీరులు, అబద్ధాల లింగప్ప
మాటలతో వుద్రిక్తులు.

తెలంగాణ జిందాబాద్
నినాదాల వూరేగి
మిలటరి అదుపులో నగరం
గాంధీ 'సెంటినరి' జరిగెను.

భారత మాతా కీ జై
తెలంగాణ జిందాబాద్
అడ్వకేట్లు, తెలంగాణ
నివాసులైన అడ్వకేట్లు
గవర్నరు దర్బారులో
మెమరాండం మొరబెట్టిరి.

రాష్ట్రపతి పరిపాలన
ప్రత్యేక తెలంగాణ ప్రతిపాదన
రెండు రెండు డిమాండులు.

బెంగుళూరులో అప్పుడు

అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడు

మరోసారి మరోసారి

మైమరచి పలికినాడు

కాడెద్దుల (కార్యవర్గ) మందకిప్పుడు

తెలంగాణ కోరికలను

మన్నించుట కష్టంబని.

ప్రత్యేక తెలంగాణ ప్రతిపాదన

రాష్ట్రపతి పరిపాలన

ఈ రెండు దక్క మరేదైన

చేయుటకై అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడు

దయతో సంసిద్ధుండట

ఎంత దయ ఎంత ధీమ

మంత్రుల ముఖ్యమంత్రిగానితో సహా

ఉద్రిక్తులు అయిన ప్రజలు

చీల్చి చెండాడినను లేదు దిక్కు

## కాడెద్దుల రాజ్యము మసి

కాడెద్దుల రాజ్యము మసి

కానున్నది కానున్నది.

ప్రజాస్వామ్యమునకు జవ

రానున్నది రానున్నది.

ముఠా రాజకీయాలు
ముండమోసి పోనున్నవి.
ప్రజాకీయముల పథము
బాహాటము కానున్నది.

రాష్ట్రపతి ఎన్నికలకు
రాద్ధాంతము సంఘర్షణ
జరుగునండి, జరుగునండి.

ఘర్షణలో కాడెద్దులు
గుర్తు మాసి పోనున్నవి.

ఎన్నబడిన రాష్ట్రపతి
తిన్నగ వర్తించి ఎదిగి
ప్రజాస్వామ్య రాజ్యాంగము
మర్యాదల కాపాడును.

భారతావనిలో తిరిగి
శాంతి భద్రతలు వెలయును.
ఆపాటి ఇంగితము గలవానిని
ఎన్నుకుంటే చాలు చాలు మనకు.

సైన్‌టీన్ సిక్టీ్స సైన్ స్వాతంత్ర్యము
నాడైనను, భారతము ప్రజాస్వామ్య
పద్ధతి అమలుకు సిద్ధము అవునేమో
చూదాము. చూదాము. చూదాము.

## మరోసారి మరోసారి

మరోసారి మరోసారి
పేరుకు మాత్రమె నిజము
పేరున మాత్రమె నిజము
ధరియించిన లింగప్ప
అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడు
స్పష్టపరిచి చెప్పినాడు.

పార్టీ పార్టీలో ముఠా
పాటిదె ప్రస్తుత కాంగ్రెసు.
కాడెద్దుల గురుతంటెనె
పాటింపదగిన ప్రాణి
జోడెద్దుల బరువంతటి
భారి మనిషి బసవన్న
రాజ్యాంగం కాలదన్ను

ధీమంతుడు శ్రీమంతుడు.

ప్రజాస్వామ్య సూత్రాలకు
పట్టుబడని కోడెగాడు
సిండికేటు పెట్టి అతడు
ఇండికేటు చేసినాడు
ప్రత్యేక తెలంగాణ
ప్రశ్నే లేదన్నాడు
రాష్ట్రపతి పాలన ప్రతి
పాదన లేదన్నాడు
మరోసారి మరోసారి.

ఎంత దయ ఎంత ధీమ
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
కెంత దయ ఎంత ధీమ.

నైన్‌టీన్ సెవంటీ టూలో
సైతం తనకే మెజారిటీయట
ఇప్పుడైతే సరే సరి
అప్పుడు తనకే పట్టం
ముఖ్యమంత్రిగా వెలగగ.

అయినా దయ తలచితాను
తెలంగాణ కాడెద్దును
ముఖ్యమంత్రి పదవి చేరి నిలువ
శిక్షణిచ్చి కాస్తాడట.

## ఎంత దయ

ఎంత దయ ఎంత ధీమ
దున్నపోతు ఈనైతను
దొడ్లో కట్టి పేస్తాడట
దిట్టల పిలిపించి మళ్ళీ
మిట్ట చదను మాట మంతి
తుట్ట తుదకు తేలేది ఏమిటిది?
ప్రత్యేక తెలంగాణ మన కోరిక
అంతకు మినహా లేదిక.

చెన్నారెడ్డి పైనం బైటబడును
కొండా లక్ష్మణ్ ధైర్యం బైటబడును
ప్రజా సమితి మర్యాదను కాపాడని
వాడెవ్వడు ఢిల్లీ వదలి, మర్యాదల గనలేడు
హైద్రాబాద్‌కు వచ్చిన మానము దక్కదు.
ముఖ్యమంత్రి పదవి కోలపోయి

కాబ్ర మరి ఎటు పోతడు ఏమో మరి.

--

మర్రి కొండా మాత్రం ఏ మాత్రం

మొగ్గినను, ప్రజల కోపాగ్నిని చవి

చూడక తప్పదు వారికి.

'కాడెద్దుల' మందలోని

పూర్వసువాసినులు వారు.

మారు మనుపు దేవు లాట

చీరరైకె సంప్రదాయ

శీలమునకు వాతబడితె

కలదు తెలంగాణ బడితె

తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త

జైహింద్ జై తెలంగాణ.

తెలంగాణ జిల్లాలలో

రోజు రోజు వేలమంది

ఆ బాలాగోపాలము

సత్యాగ్రహము జేసి జేళ్లు

నింపి వేయుచున్నారు

హై స్కూళ్లు, హాస్పిటల్స్

రోగుల నివాస గృహాలు.

సత్యాగ్రహులతో నిండి

జైళ్ళగ మారుతున్నవి.

ఆంధ్రప్రదేశము కాదిది

బ్రహ్మానంద విచిత్రపురి
ఆనంద నిలయం దాదా
అదుపులోన ఆంధ్రావని.
జైహింద్ జై తెలంగాణ.

## ఇదే రోజు ఇదే రోజు

ఇదే రోజు ఇదే రోజు
తెలంగాణ పోరాటము
మరో మలుపు తిరుగు రోజు.
బ్రహ్మానందుడు ఢిల్లికి
పెళ్లితె మరి తిరిగి రాడు
ముఖ్యమంత్రి మోజు పోజు
ఉండదు ఉండదు వానికి.
రోగమో నొప్పో గాయమో
ఏదో ఒకటొచ్చి తీరు
ఈ మాటకు లేదు తిరుగు
ఇక వారము తిరుగదంచు
చెప్పితి నేనిదే రోజు.
ఇదే రోజు, ఇదే రోజు.
చెన్నారెడ్డి పైనం
బైట పడేదిదే రోజు.
కొండా లక్ష్మణ్ కాంగ్రెస్

వదలునేమో ఇదే రోజు
కాడెద్దుల రాజ్యానికె
ముప్ప, మొదలు ఇదే రోజు.
ఓట్లకు షొట్లకు సమరం.
తీవ్రమగుట ఇదే రోజు.
తుది విజయము ఓట్లది.
తప్పకుండ జరిగి తీరు.
కేంద్రానికి బుద్ధి లేదు
పార్టీవ్రత్యము తత్వము
ముతా రాజకీయాల్లో
పడి మునుగును దేశమంత.
ప్రజాస్వామ్య రాజ్యాంగము
ప్రారబ్ధము తిరిగి వ్రాయ
సన్నాహము నేటి నుండి
తెలంగాణ దీక్షబూని
మెలిగినపుడు బెంగలేదు.
ఏ మాత్రము ప్రాణాలు ధారబోసి
తెలంగాణ పేర్పాటుకు
సిద్ధము అందరికందరు
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

# <u>మునిగి మురిగి చస్తున్నది తీరం</u>

మునిగి మురిగి చస్తున్నది తీరం
ఎండిమాడి చస్తుందా కాకతి?

చిత్తూర్లో త్రాగే నీటికి
ఇస్తాన్రట సర్కార్ చీటి
అరదేశాలు మరల్లో
పాతాన్రట భూగోళం వదిలి.

అణుశక్తి ప్రభావంలో పడి
ముందుకు పోతాందాలోకం?
అణువణువులో ద్వేషం చిట్లి
కణ కణముగ పగ మంటలు ఎగిసి
మనిషి మనిషి పిశాచి మాదిరి
తనను తానె మలపేస్తాడా?

ఆది వాసము కన్న పూర్వస్థితి
భూగోళానికి మళ్లోస్తుందా?
స్నేహం ఉడిగినా ప్రమిదల వత్తులు
కమిలి కమిలి తిమిరం పాలా?

మనిషిని మనిషి నిలువున చీలిచి
చేతుల నిండా నెత్తురు జూసుక
తిమిరవేణీ సంహారానికి
కసుబుసు లాడుచు మసి అవుతారా?

సహజధోరణికి సంస్కారానికి
సహస్ర యోజనాల దూరము
సభ్యత, సంస్కృతి, మర్యాదలకు
సందులేదు, మాటెత్తుట కైనను,
సర్వనాశనము కానిదె లేదిక
సంస్కారానికి వేరే మార్గము.

'దయ, ధర్మం, సహకారం, సాయం'
అమలులో లేని మాటలు ఎప్పుడు.
ఎవనికి వాడే సర్వేసర్వా
ఎవ్వనిసెవ్వడు చేయడు ఫర్వా
చంపుతా, చంపుతూ చస్తా అనునదె
పస్తులు ప్రచలిత మానవ నిష్ఠ
ప్రస్తుత సాంఘీక న్యాయం నియమం

# ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ

ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ

పరమ సన్నిహితుడు వాడు

కాంగ్రెసు సంస్థను కాయగ

కంకణ బద్ధుడు వీరుడు

నిలువెల్ల రాజనీతి

నిజాయితీకి మారుపేరు

దేశము ఎల్లలకిప్పుడే

దేశము భయము లేదు

సైనిక దళాలు ఎప్పుడు

సై అంటే సై గున్నవి

ఆంధ్రంతట షూటింగు

అభ్యాసము మూడు నెల్లు

అలజడిదారులు అందరు

అదుపులోకి వచ్చినారు.

తిరుగబడిన నక్సలైట్లు

విరుగుడయ్యి పోయినారు.

అయిదు జిల్లాల నుండి

అదనపు సైన్యం తరలెను.

రాష్ట్రపతి పాలనలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

రాణిస్తున్నది భేషుగ

ఎచ్.సి.ఎస్., వి.కె.ఆర్.

ఏదంటే అది న్యాజు.

సి.పి.ఐ. సమగ్రతకు

సిద్ధము వేదిక వేడుక

రంగా, తెన్నేటి, గౌతు

లచ్చన్నల ఆటకట్టు.

శ్రీరాములు దండంత బే

జారై రాజీ పడద?

కాంగిరేసు వదలలేని

ఘనుల మార్పు ఎంతలోన?

సి.పి.ఐ. కాంగిరేసు ఎటు

--

చేరితే దేశము అటు.

తక్కినోరు ప్రజలు కారు

నొక్కితే మూస్తరు నోరు.

తెలంగాణ నంత మళ్ళీ

మెల్ల మెల్లగ అదుపులోకి

తెలంగాణ తెస్తానని

తెస్తాండు మర్రిచెన్న.

పేరుపాటు ధోరణితో

పేరౌతానన్న ఘనులు

పార్లమెంటు ఆ సభ్యులు

ప్రధానమంత్రి గాంధీతో మాట

ముచ్చటకు ఈనాడే

చచ్చినట్లు వచ్చినట్లు

వార్త కూడ తెలిసొచ్చెను
వంగడమే వంశము కద.

## గోంగూర గోబ్యాకను

గోంగూర గోబాకను
గతి మూలమున ఉన్న
'నదీపారు' గోబాకను
నాద మూలమున ఉన్న
'ఆంధ్రా' గో గోబాకను
అలజడిలో దాగున్న
'దాగుడు మూతల తల్లి'
'ధర్మాచరణము' కన్న
దారుణము, అన్యాయము
ధ్యాసకు రాదుర అన్న
దేబెల 'లూటీ' చేయుట
తెలివి తేటలా అన్న
పదవి బలముతో 'లూటీ'
పౌరుషమెట్లగు నన్న
ప్రత్యేక తెలంగాణ
దక్షిణ పాకిస్తానమా?
పెత్తన్‌దారీ సెదరి
చెత్త చెత్తగా కొట్టిన

కంకణమ్ము కట్టుకున్న
కామరేడ! నిజమేనా?
స్వయం నిర్ణయము 'రైటు'
తెలంగాణకే లేదా?
అయిదు ఆరు జిల్లాలకే
అంతమింగు అధికారమా?
కోస్తా ప్రాంతం బూర్జువ
కోడెనాగు పడగనీడ
తెలంగాణ, రాళ్ళసీమ
'దితిపుత్రులు' చేరి ఆడ
బాసపేర 'గులాపోని'
బ్రతుకు బ్రతకమంటావా?
హిట్లరు బులేట్ల కన్న
రజ్వీ జంబ్యాల కన్న
నీతి బాహ్య మార్గాన
ఓట్లుబొంది సీట్ల జేరు
ముటాకోరు బలగాల
చేజిక్కి అధికారము
పరిపాలనతో ప్రజలకు
జరుగు ప్రమాదం గొప్పది.

# దొంగ ముల్కి పట్టణాలలో

దొంగ ముల్కి పట్టణాలలో
సంగనాచిపై మెలగుచు
ఉద్యోగం తేని 'ముల్కి'
ఉద్రేకం కాదనకు.
బ్రతుకు తెరవులన్ని ఆంధ్ర
బాంధవులే కాజేసిన
తెలంగాణ, రాళ్ళసీమ
తిండికి గుతుపలు ఎత్తవ?
దోపిడి దౌర్జన్యాలకు
దోసిలొగ్గి జీవించుట
పౌరుషంబు కాదనుచు
పలుకలేద గాంధి తాత
''చిత్తశుద్ధిగా అహింస
వృత్తి బూనలేనపుడు
బడితెబూని దుష్టుని
కడతేర్చమనెను గాంధి తాత.''
సర్వోదయ స్వాములంత
సర్వోదర స్వాములగుచు
ఆతతాయి వర్గాలకు
అధికారము అప్పగించి
సత్యాహింసల బోధలు

సలుపుటె వృత్తిగబూని

సంచరించు ఆశ్రమాల

స్వాములార నిజమేనా?

ప్రజాస్వామ్య పద్ధతిపై

పాలన చేయక మందిని

దోచుకొనెడి కాంగిరేసు

దొరలారా! నిజమేనా!

## మనిషివన్నది మరవకన్నా

మనిషివన్నది మరవకన్నా

ఎదుటివాడును మనిషె అన్నా

ఎదుటి వానిది మనసె అన్నా

మంచినెవ్వడు మరవడన్నా

ముంచితే క్షమియించడన్నా

మాట ఇచ్చి తప్పి మళ్లి

మాట ఇస్తే నమ్మడన్నా

నమ్మకము పోగొట్టుకున్నా

నమ్మడెవ్వడు వానినన్నా

ముఖ్యమంత్రి మాటలు బూటకాలని

మూడునాడుల వెల్లడన్న

'విశాఖ ఉక్కు' హత్యకాండల

పిశాచి ఎవడో తెలుసు అన్నా

రక్షణల ఒప్పందమెవర

లక్ష్య పరచిరో తెలుసు అన్నా
ఉపాధ్యాయుల సమ్మె జేయగ
ఉసికొల్పిరెవరో తెలుసు అన్నా
ఆంధ్రలో ప్రతి ఉద్యమాన్ని
అమలు జరిపినదెవని అన్న?
తెలంగాణోద్యోగి ప్రగతికి
తిలజలాలు ఎచటి వన్నా?
మోసమెప్పుడు సాగదన్న
'కాసే' సర్వము కాదురన్న
'ధర్మపన్న' వల్లైపేస్తే
దొడ పండ్లురాలునన్న
కుటిలమతితో శాంతిపేరట

కుంటిసాకులు చెప్పకన్నా
కోటి ప్రజలమేటి కోర్కెను
హాటు పెట్టగ చూడకున్నా
పెదవి విశ్వాసమును చూపెడి
పదవి దాసుల నమ్మకన్న
అభయమిచ్చి తమ్ము కుత్తుక
నదిమి పట్టిన ఘనుడవన్న
పేరు పడితె ఘనుడవన్న
పెక్కిరిస్తవు ఎందుకన్న
ఎన్నుకున్న దేబెతమ్ముని
వెన్ను పొడిచినదెవడు? అన్న

పేపుకుని ఇన్నేండ్లు ఇప్పుడు

పెధవ కూతలు కూయకన్న

నిక్కకిప్పుడు, పదవి వూడిన

కుక్క సైతము కానదన్న

దొంగ పేషాలెన్ని పేసిన

భంగపాటు తప్పదన్న

పదవి వదలక చిలక పలుకులు

పలికితే రాణించదన్న

ప్రాంతభావము తోడ నెవ్వడు?

పక్షపాతము జూపెనన్న

'కోస్త' పేరట తెలంగాణను

గొంతుకోసిన దెవడు అన్నా

ఏమీ ఒప్పందాల అమలుకు

అడ్డు వచ్చిన దెవడు? అన్నా?

ఆరోపణలు లేవంటే లేవని

కక్షబూనినదెవడు? అన్నా

రక్షణలు లేవంటె లేవని

కక్ష బూనిన దెవడు అన్నా!

--

అన్నా? అన్నా? అన్నా?

అన్నా? అన్నా? అన్నా?

అంతా దోచుకొని, అన్నా?

హామీ లెగబెట్టి, అన్నా?

గోమార్తై పట్టి అన్నా?

దగాజేసినోడు, అన్నా?

'పగోడు' సయమింతకన్నా

అన్నా? అన్నా? అన్నా?

తమ్ములను చెడగొట్టి, అన్నా?

తమ్ములను విడగొట్టి, అన్నా?

'అన్నతనం' ఇది అయితే

'అన్యత' దేన్నంటరన్న?

గొర్లమంద మంద కొకడు

గొల్లన్నంటేమిటన్న?

మొసలి కంటి తడి బెట్టుక

మసలుచున్న కసాయన్న

చేసిన నిర్వ్యాకానికి

పేసరితిమి చాలన్న

పన్నెండేడులు తమ్ములు

పడ్డపాట్లు చాలన్న

మంచి మాట కిప్పుడైనా

పంచుకోని, మమ్మన్నా

తిన్నంగా వినకుంటే

'ఉన్నది' ఎరుగువ అన్నా?

## కాముడా వలలో

కాముడ కాముడా వలలో

చేజిక్కి పోంగా వలలో

గరీబీ హటావంచూ వలలో
గర్జనలు చేస్తూ వలలో
ఇందిరమ్మా ఇందిరమ్మా వలలో
ఇండియా కాయంగా (ఏలంగా) వలలో
ప్రజల రాజ్యమంచూవలలో
ప్రకటన జరుగంగ వలలో
ప్రజల రాజ్యమంచూవలలో
ప్రకటన జరుగంగ వలలో
ప్రజల ఓట్లతోనే వలలో
ప్రతినిధులుండగా వలలో
పౌరుల కోరికలూ వలలో
పాటించబడవూ వలలో
తెలంగాణా ప్రజలు వలలో
దిక్కుమొక్కు లేక వలలో
ఏడుస్తూ పోతే వలలో
ఆంధ్రప్రదేశ్ రాజ్యమ్మ వలలో
అలమటించిపోతే వలలో
ఆంధ్రుల దోపిడీకి వలలో
అంతకోలుపోతే వలలో
ఒప్పందాలన్నీ వలలో
ముల్కీ రూల్సన్నీ వలలో
ముండ మోసిపోయె వలలో
బాలబాలికలకు వలలో
చదువులు లేహాయె వలలో

చదువు సంధ్యలు ఉన్నా వలలో
పొత్తుల రాజ్యంలో వలలో
తెలంగాణా పలుకూ వలలో
దేబెల పలుకాయె వలలో

ఇక్కడి యా సంతా వలలో
హేళన పాలాయె వలలో
రెండున్నర జిల్లాలదే వలలో
దండి బాస ఆయె వలలో
బతుకమ్మ బతుకమ్మ వలలో
పండుగ కాదాయె వలలో
కట్టమీది మైసమ్మ వలలో
కానరాదాయే వలలో
రెండే జిల్లాల వలలో
రేడియో బాసాయె వలలో
సర్కార్ ఆంధ్రులకే వలలో
సర్కార్ నౌకరిలు వలలో
సంజీవారెడ్డీ వలలో
సగము బోడీ చేసె వలలో
కాసు బ్రహ్మానంద రెడ్డి వలలో
కాజేసెను సొంతం వలలో
సొగదు పొత్తంటూ వలలో
సొగదీసినారూ వలలో
సొగదీసినారూ వలలో

తెలంగాణా పేరూ వలలో

తెల్చిచెప్పినామూ వలలో

పేరు రాజ్యమంటూ వలలో

కోరిక తెలిపామూ వలలో

పొత్తులో రాజ్యంబు వలలో

వుత్తది అన్నాము వలలో

బళ్ళుబందు జేసీ వలలో

ఇళ్ళలో వుండీ వలలో

## తెలంగాణ ఏర్పాటును

తెలంగాణ ఏర్పాటును

లక్షించెడి ప్రతి ఎడంద

తెలంగాణ మృతవీరుల

స్మృతి ఫలకమై వెలయగ

మృతవీరుల స్మృతి చిహ్నము

మితిమీరిన దౌర్జన్యము

ప్రజ్వలనముగా జ్వలించు

ఆంధ్రప్రదేశ్ రాజ్య ప్రభుత్వము

వహ్వారే కాసు బ్రహ్మానంద రెడ్డి

చతురనీతి పరిపాలన

రోకటి తల పొగచుట్టి

రేగిన మతి విజృంభణ
ప్రత్యేక తెలంగాణ
'దక్షిణ పాకిస్తానము'
అంటాడు 'కరుణశ్రీ'
ప్రజాస్వామ్యధీ పూజ్యుడు.
ఒప్పందం అమలులేక
పన్నెండేడులు గడిపి
ఆతరపడినట్లు లేచి
ఇదిగో ఇప్పటినుండి
షరతులన్ని అమలు జరిపి
తెలంగాణ మరమ్మత్తు
చేస్తామని కాసు బ్రహ్మానంద రెడ్డి
వెల్లడింప, ఒకే రాజ్యమందున్న
ఏ ప్రాంతము వారికైన
ప్రత్యేకంగా హక్కులు
చెల్లవు అని కోస్తంత
ప్రదర్శనలు, అలజడులు
రిట్‌పిటీషన్ తీర్పులు
ఇంతకు ఆ ఒప్పందమె
ఆంధ్రప్రదేశ్ రాజ్యానికి
తెలంగాణ ప్రజల
పట్టి ఒప్పించిన ఘన పత్రము
ఒప్పందమే లేకుంటె
ఆంధ్రప్రదేశ్ రాజ్య మేలేదు

తెలంగాణ ఏర్పాటు
జరిగినది ఏనాడో.

కేంద్ర ప్రభుత్వము సూచన
తెలంగాణ విషయంలో
ఆనాటి ఒప్పందం
స్పిరిటును లెటరును
మించి పోతాందట

అమలు కూడ నోచుకోని
ఆపాటి ఒప్పదలనె
ఒపలేక కాలరాచి
పారేసిన చాణుక్యులు
ఈనాటి కేంద్రీయ
సూచనలకు ఒపుతార
ఎంతమాట    ఎంతమాట
'చలపతి' గౌరవనీయుడు
ప్రవచించె ముద్దుగాను
తెలంగాణ మాటెందుకు
ప్రజామతము పనికిరాదు
అది అర్ధము లేనట్టి పదము
ప్రజామతమునకు మహత్తు
ఇచ్చిన ఒకపరి వారు

తిరిగి అలనాటి బూజు

నైజాము పరిపాలన

కోరిన రాదా ప్రళయము

అంటాడొక ఎంఎల్ఏ

జై ప్రజాస్వామ్యానికి జై.

--

## తెలంగాణలో మళ్లీ

తెలంగాణలో మళ్లీ

''దౌర్జన్యము ప్రజ్వలనము

పోలీసుతో సంఘర్షణ''

ఆంధ్రప్రదేశ్ పత్రిక రాజము

పతాక శీర్షిక ప్రకటన

తెలంగాణ ప్రజలంటే

దౌర్జన్యానికి పేరు

కోస్తోరు సౌమ్యులు

ఏ పాపము చేసెరుగరు

కేంద్రప్రభుత్వం ప్రస్తుత

సూచనలు అలనాటి

పెద్దమ్మల ఒప్పందం

స్పిరిటు లెటరుకు మించి
పోయినవట.
అమలు కాని ఒప్పందం
ఒపలేని కోస్తాంధ్రులు
కేంద్రం చేసెడి సూచన
కొప్పకోరు ఒప్పకోరు
చలపతి గౌరవనీయుడు
చలాకీగ ప్రవచించె

తెలంగాణవారు వచ్చి
రౌడీలు, మళ్లి రేకెత్తినారు
గొర్లు మేకలవలె అమాయకులు
కోస్తాంధ్రులు
ఏమైపోతారో పాపం
హెూంమంత్రి ఉన్నాడుగా
శాంతిభద్రతల కాయగ
పోలీసుకు కన్ను గీట్తే
తెలంగాణ రౌడీలను
కాల్చేసే దెంతలోన
--
పి.ఎవ్ు. మన మనిషాయెను
కేంద్రం మనమన్నట్టుల
తల ఊపెడి స్థితి దానికి
కాసుబ్రహ్మానంద రెడ్డి కేమిటడ్డు

చస్తే చస్తారు
తెలంగాణ మెట్టంతట మాగాణము చేయతలపెట్టిన
కోస్తా పంటకు ముప్పై
పెలుస్తున్న చీడపురుగు వంగడాలు
తెలంగాణ దుండగీళ్లు

ఆంధ్రప్రదేశ్ విభజనన్న
మాటే లేదనుచు మొన్న
కాసుబ్రహ్మానంద రెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

మహారాష్ట్రముకు ఎదుటి
అన్నమాట విని కూడ
మళ్ళీ తెలంగాణ అనుచు
ఎగురుతాన్రు ఎంతటి మూర్ఖులు

బృహస్పతిని మరిపించు
విద్యావంతుడు మీ
పీ.వీ. విద్దెల మంత్రి
తెలంగాణ పేర్పాటు వద్దంటడు
అంతకన్న మీకెరుక
తెలంగాణ హితము మాట.

జేవీ నర్సింగరావు

ప్రజాహితము తరతరాలు
దృష్టి యందు గల భూకామందుల
వంగడమునకు శోభ అతడు
అతణ్ణడిగి జూడుడు
మామాటబద్ధమైతే

ఆందోళన మాని మీరు
కాసుబ్రహ్మానంద రెడ్డి అదుపులోన
కిమ్మన్నాస్తి అనుకుంట
పడివుండుడు

కలో గంజో అంబలో
ఏదో పోస్తాను మీకు
మీ పొలాలన్ని దున్నేసి
మేమే పండిస్తాము
మీకెందుకు శ్రమ
వర్తకాలు, ఆఫీసులు
పని పాటలు ఏదైనను
మీ రెరెగరు ఆ పనంత
మేమేదో మా వారికి
అప్పగించి చేసేస్తము
మీరు మేమన్నట్లు
మెలగండి అంతేచాలు.

ఇంతైనా వినకుంటె

అనుభవిస్తారు మీరె

అణిచేస్తము, పత్రికల్లో

ప్రకటిస్తము, తెలంగాణ

దౌర్జన్య ప్రజ్వలనము

పోలీసుతో సంఘర్షణ

ఆంధ్రప్రదేశ్ పత్రిక రాజము

ప్రకటించుట అబద్దాల

నిజంగానె ప్రకటిస్తుంది

''మృతవీరుల

స్మృతి చిహ్నము

మితిమీరిన దౌర్జన్యము''

వహ్వారే కాసు బ్రహ్మానంద రెడ్డి

మతి చెదరిన పరిపాలన.

## మృతవీరుల స్మృతి సైతము

మృత వీరుల స్మృతి సైతము

మితిమీరిన దౌర్జన్యము

వహ్వారే (కాస్తాంధ్రుల) కాసు బ్రహ్మానంద రెడ్డి

మతి చెదిరిన పరిపాలన

మేయరు, పేరుల్లో మొదటివాడు

మహా పురపాలక సంఘాదేశము మేరకు

మృతవీరుల స్మృతి చిహ్నాము

హెచ్ఎచ్ంసి పరిధుల్లో నిలుపలేడు

వాడు ట్రెస్సుపాసరు

(జేలుకర్తుడు)

వహ్వారే (కోస్తాంధ్రులు) కాసుబ్రహ్మానంద రెడ్డి

మతి చెదిరిన పరిపాలన.

తెలంగాణ మృత వీరుల

స్మృతి చిహ్నాము

పెలయుటన్న

శాంతిభద్రతలు సున్న

భరియించడు హెూముమంత్రి

పిగ్ ఐరన్ మనిషి అతడు

ఇంటింట నిలపేయి నతని బొమ్మ

కాసుబ్రహ్మానంద రెడ్డి కతడు బ్రహ్మ

# తెలంగాణ ప్రజాసమితి

తెలంగాణ ప్రజాసమితి
తలదించుకొన్నదెపుడు?
''బైఫర్‌కేషన్ డిమాండ్
బైలుదేరది''క అనుటకు
ముఖా తత్త్వోద్భవ
శరకేతనమును
ఏమంటివి? ఇకమీదట
ఏనాడును బైఫర్‌కేషన్
ముచ్చట 'తల' ఎత్తద?
ముఖ్యమంత్రి సిరినీ కంతటి
స్థిర విశ్వాసము కూరెనా?
స్థిరమా? నీ ప్రస్తుత స్థితి?
ప్రభుత్వాధికారమంత
పట్టుబడిన బలము దిగువ
హిట్లరుగ వర్తించే
హీనరాజకీయ వేత్త!
ప్రజల కోర్కె తీరుదాక
ప్రజల ఉద్యమం సాగును
ప్రభుత్వాలు కూలుకాని
ప్రజలు కూలిపోరెన్నడు.
రెండున్నర ఏళ్ళపాటి

షండ ప్రభుత్వం చేకొని
చండ ప్రచండునివలె
సందడి చేస్తావెందుకు.
మొండితనం రానించగ
దండిగ కూసేస్తున్నవ్.
యాహియాఖాన్ మార్షల్లా
అంతరించి పోలేదా?
బాంగ్లా ప్రజకోర్కె తీర
బ్రతికి బైట పడలేదా?
ఏపాటి కాడ నీవు?
ఎన్నాళ్ళు నీ ఆటలు?
'అండే పే కీ జర్దీ'
అంతరించలేదింకను
పార్టీవ్రత్య రాజకీయ
చదరంగంలో బంటువు
మంత్రి గదిలో చేరినావు
మరవకు నీ మూలస్థాయి
అలసి సేద దీర్చుకొనుట
తలను దించుకొనుట గాద?

ఎంత పెద్ద స్టేటసుతో
ఇంతటి మాటన్నావు?
జలగం వెంగళారాయా
కులతత్వము మదికాన

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ద్వైవ విభజన
అనేమాట తల ఎత్తద?
ఎప్పటికీ ఏనాటికి
ఎవ్వరు ఆ మాటలెత్తర?

పెర్రి పెంగళప్పవోలె
గుర్రు గర్రు అన్నావా?

'చెన్నాపట్నం' చేరీ
తిన్నంగా కూసినావా?
తెలంగాణ పేరుమాట
తల ఎత్తదు అంటావా?
ఆ మాట 'తలవంచిందని'
అనుకుంటివా ఎర్రోడా?

టి.పి. రావ్ చెప్పిందే
టి.పి.యస్ మాట నీకు

ముఖ్యమంత్రి పెర్రి పెంగళప్ప
ములాతత్వ తొత్తుకొడక
నువ్వుండవు; నిన్ను కన్న
ప్రధానమంత్రి కూడ మిగిలుండదు.
భారతదేశము వుండును

పేర్లై వెలయును నిలుచును

--

కోటిన్నర మేటి ప్రజల

గుండొక్కటి గుండెలోని

గుట్టొక్కటి మేటి ప్రజల

మాటొక్కటి మనసొక్కటి

ముటాతత్వమే ముస్తాబు

శఠమే స్వభావం

పదవే శక్తి సామర్ధ్యాలు

ప్రతిభావిశేషాలు గల్గినందుకే

సత్యాగ్రహుల కాల్చిచంపడమే పరమలక్ష్యం

అస్తిత్వంలోలేని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

ముఖ్యమంత్రి జలగమన్న వెంగళప్ప

స్థిరవిశ్వాసంతో వున్నాడట.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ద్విభజన

మాటే తలెత్తదట తన రాజ్యంలో

ఆస్తిత్వం కోల్పోయిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి

శ్రీజలగసున్న వేంగళ.

శ్రీ జలగసున్న వెజీరోగళరావు

ఆస్తిత్వం లేని ఆంధ్రప్రదేశ్ రాజ్యానికి

'బరాయె నాం' వజీరు

తన రాజ్యంలో ఎప్పుడూ ఏ నాటికీ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన ప్రశ్నే తలెత్తదన్న
స్థిర విశ్వాసంతో వున్నాదట.
ముఖ్యమంత్రిగ మురిసిపోతున్న
పెంగళప్పా నీ హయాము
మా వుంటే రెండేళ్లు.
బైఫర్‌కేషన్ ఆఫ్
ఏ సివిల్ సెవర్ బి రేజ్డ్
ఇన్ మై స్టేట్.
నువ్వెంత నీ స్టేటసెంత
నీ స్టేటు నిలిచే దెన్నాళ్లు
బైఫర్‌కేషన్ ముచ్చట
అసలే తలెత్తదనెడి
స్థిర విశ్వాసానికి
ధీమా ఆసరహేతువు
ఏమున్నది?
టి.పి.ఎస్.
తెలంగాణ ప్రదేశ్ స్టేటు
ఏర్పడ జేసుకునేందుకు
ధృడ సంకల్పులు ప్రజలు
ఆ ముచ్చట
తలెత్తదు అనేమాట
బైఫర్‌కేషన్ ముచ్చట
తనతలను
దించుకున్న దెప్పుడుని

టి.పి.రావ్ మాటలను
టి.పి. యస్సంటా.
మర్రి చెన్నారెడ్డన్నడా?
తక్కెళ్ళపలిగా 'మర్రా' నీ
తో యీమాటన్నది.
'బైఫర్‌కేషన్' డిమాండు
మానుకున్న వారెవ్వరు.
తక్కెళ్ళపల్లి మర్రా?
తెలంగాణ ప్రజాసమితి
తలను దించుకొన్న దెపుడు
బైఫర్‌కేషన్ డిమాండు
తలెత్తదు అని అనుటకు
ఆ ముచ్చట తలెత్తదు ఇక
ముందని నీ వనుటకు

# తెలుగుబాస ఎన్నితీర్లు

తెలుగుబాస ఎన్నితీర్లు
తెలుగు యాస ఎన్ని తీర్లు
వాడుకలున్నన్ని తీర్లు
'వాడుక' ఏ తీరుగున్న
తెలుగు బాస వాడుకయే
అన్ని తీర్ల వాడుకకు
పరపతి పెత్తనమొకటే
ముఖే ముఖే సరస్వతి
నోట నోట మాటమ్మ.
అన్ని తీర్ల వాడుకను
ఒకే తీరుగా చూచుట
ఎవరి వాడ వారిది అని
ఎవరి పేడ్క వారిది అని
ఎవరిదైన వాడుకే అని.
అందరికి వేడుకగా తలుస్తే.
తెలుగు బాస అభివృద్ధి
ఒకే బాస మాటాడే
తెలుగు వారిలో సమైక్యత
లేకుంటే తన్నులాట
తప్పదు ఏనాటికైన
రెండున్నర జిల్లాల

రెండుమూడు తెగలోండ్లకు

‘బడిపలుకుల’ బాబులకు

పంజరాల చిలుకలకు

ఎప్పుడు తెలుస్తుందంట

ఎన్నడు తెలిసొస్తుందంట

వాడుక బాషంటే ఏందో?

ఎవరి వాడకం భాషో?

గ్రాంధికాన్ని వద్దంటూ

--

రెండున్నర జిల్లాల

చదువుకున్న తెగలోళ్ళ

వాడుకనే గొప్పజేసి

దానికె పట్టం గట్టి

‘గురజాడ’ ‘గిడుగు’ పేర

మసిబూసి ముండమోపి

రెండున్నర జిల్లాలదె

దండిబాష అంటు చాటి

తక్కినోళ్ల నోళ్లు యాన

తొక్కి నొక్కి పెట్టి వుంచి

రెండున్నర జిల్లాల

చదువుతున్న కుటుంబాల

రెండుమూడు తెగలోళ్లదె

‘ప్రామాణిక భాష’ అని

శిష్టుల వ్యావహారికమని

అందరి తలపై రుద్దితే
ఎక్కడి న్యాయం అంట
ఇంతకన్న అందరికి
ఒకే తీరు ఇబ్బంది (కలిగించి)
ఒకే తీరు సాధన కలిగించే గ్రాంధికము
సాధ్యమైన గ్రాంధికము
నయమనిపిస్తది అన్న
'వాడుక బాస' అంటె
రాయవచ్చినోడు రాసే
దస్తూరి వలె కాదా?
దస్తూరిలో లిపి వలసే
మాటల్లో యాసకాదా?
దూస్తురిలో అక్షరాల
రూపువలెనె
మాటల ఉచ్చారణ అవును కాదా?

ఎవని యాసలో వాడు
మాట్లాడుతున్నట్లే
ఎవని మాండలికము వాడు
వాడుకొనుచున్నట్లే
ఆ యాసతో, ఆ విరుపుతో
ఆ యమకం గమకంతో
రాస్తె, తప్పేమిటంట?
అన్ని వాడుకలు కూడా

ప్రామాణిక స్థాయి తోడ

వెలుస్తుంటె తప్పేమిటి?

కాళిపట్నం రామారావు బాస బాస కాదా?

రాచకొండ విశాస్త్రి యాసరాత బాసకాదా?

1. ''దయ్యాల పన్గడది'' మెదక్ పలుకు బాసకదా?

2. 'అంగుడుపొద్దులో' వున్నది కరినగరం బాస కాడా?

3. సోమరాజు 'పొద్దు' లున్న బాసకు పట్టంవద్దా?

4. 'కొడుకుపుట్టాలె' బెస్తపల్లె బాస బాస కాదా?

రాయలసీమ వాడి బాస ఇపుడు యాడున్నది?

'శ్రీకాకుళ' గిరిజనుల తెనుగు తేనెలెచటున్నవి?

'బొబ్బిలి దిబ్బల' పులుల గాండ్రింపులు వినరావేం

అందరిచే 'చిత్తం' సార్ అనిపించే చిత్తవృత్తి రెండున్నర

జిల్లాల 'బుల్లోరి'కి ఎందుకంట?

'ముద్దాయి' అన్న మాట

'ముద్దయి' ని మధ్యక్షర దీర్ఘంతో

గుంజిలాగి పల్కితేసే

ప్లేంటిఫ్ అక్యూజుడైతడ

'ముల్జిం' అక్యూజుడు అనుకోండని

అధికార రాజకీయ దుర్మదాంధం

ఏ ప్రాంతం సౌలభ్యం కోసరమని

యేమనవలె ఏటింకా దౌర్జన్యం.

--

ముద్దాయి అని అంటే

దావా చేసిన వాడు

దావంటె ప్లేంటుకాద?

దావా చేసినవాడు

ముద్దాయి అవునాకాద?

'అక్క్యూజుడు' అనుమాటకు

'ముద్దాయి' తెలుగుజేసి

'ముల్జిం' మాటకు మారుగ

వరంగల్లు అదాలత్‌లో

బోర్డుపెట్టి ముద్దాయంటే

నీబాంచెను గులాపోణ్ణి

అన్నోనికి, చిత్తంసార్, చిత్తంసార్

అన్నోనికి, ఫరఖేమిటి, భేదమేంది?

'రోడ్డంటే' తప్పుకాని పేత్తలంత

'సడకంటె' చెవులు మూసుకొనుటెందుకు

'టీ' హాయిగ చప్పరిస్తు

'ఛా' అంటే 'ఛా ఛా' అని

'మొగ' మేదో తాగినట్లు

ప్రేలాడించడమెందుకు?

'కోర్టుని' 'హైకోర్టుని' గౌరవంగ

పలుకన్నలు,

'అదాలత్' అని అంటెను

న్యాయస్థానము వారికి

అవమానం జరినట్లు

ఉలికి ఉలికి పడుటెందుకు?

'మా అమ్మ వచ్చింద'ని అనుకుంటూనె

‘మా నాయిన వచ్చిండ’ని అన్నందుకె
చెవులు మూసుకొనుటెందుకు?
‘మందలించు’టని అంటే
తమ వాడుక బట్టి దాన్ని
‘చీవాట్లని’ అర్థించుక
‘పరామర్శ’ ‘పలకరింపు’
అను అర్థంలో వాడుక
తెలంగాణ ప్రాంతంలో
ఉన్నదన్న ‘తెలివిడి’ కూడాలేక
కయ్యానికి కాలుదువ్వు ‘సహృదయం’
నేమనవలె?
పోయిందంటే చచ్చిపోయిందని
అనుకొనుట ఎందులకని
నక్కలగుట్టలో వున్న
‘ల్యాండ్ మార్టుగేజు’ బ్యాంకు
‘ఆరాజీరహన్ బాంకు’ బోర్డే మంటది.
‘భూమి తనఖా బాంకట’ దానిపేరు.
‘తనఖా’ అంటే జీతం
తెలంగాణ వాడుకంత
తనఖా అంటే జీతం
పారసీ పదం అది
సర్కారు పరిభాషలో
నిజామంత వందలేళ్ళు
వాడుకకెక్కిన పదమది

కోటిన్నర తెలుగోళ్ళకు

‘తనఖా’ అంటే జీతం

వారిని తనఖా అంటే ‘రహన’ని (మార్టగేజని)

అర్థం చేసుక చావండని

ఈ తీరుగ లొంగదీస్తె

అడిగే హాడే లేడా?

--

దర్జాయన, మేరాయన

అంటేనే ఏవగింపు ఎందులకని?

‘టైలరు’ ఎక్కడి తెనుగు?

‘సేగెదారు’ తెలుగుకాదు.

‘క్లరకు’ అంటే తెలుగా?

ఎన్.జి.వో, ఎల్.డి.సి. యూ.డి.సి అంటే తెలుగా?

బి.డి.ఒ, చేర్‌మన్, హెచ్.ఎవ్ు, పి.ఎం, సి.ఎం.

అన్న మాటలే తెలుగా?

హైద్రాబాద్ దుకాణం పేర్ల బోర్డులన్ని

ఇంగ్లీషులో వున్నాయని

ఏడ్సిండట ఒక ప్రతినిధి

తెలుగు మహా సభల,

దుకాణం దుకాణమంటే

ఎందుకన్న అదరిపాటు.

‘కొట్టు’ షాపంటే మెప్ప

కులుకు పాటు ఎందులకని?

‘సిల్‌సిలాగా పెట్టి’న్నని

సేగెదారు అంటేనె
'సీరియల్'ను యీా 'పెధవ'లు
'సిల్‌సిలా' అంటాన్రని
పెక్కిరించు రెండున్నర జిల్లాల
చిలుక పలుకు అధికార్లను
తెనుగు భాష మాట్లాడే
భావ సమైక్యతకై కృషి చేసే
నన్నయ్యని కొలవాల్నా?
పళ్ళు విరగ తన్నాల్నా?
ఆంధ్రప్రదేశ్ రాజ్య సమైక్యత
చెదిరి పొయ్యే దుర్ఘటన ఏర్పడెనట
ఆంధ్రప్రదేశ్ రాజ్యానికెంతో
ప్రాణాంతకమై పోయిందట.
గండం తప్పిందట
అందుకె రాష్ట్ర సమైక్యతను
నిలిపుంచే ఘనసంకల్పంబట?
ప్ర. తెలుగు మహాసభలట
ప్ర. తెలంగాణ ప్రదేశం
రాజ్య మొకటి ఏర్పడితే
భారత జాతి సమైక్యత
కేమిటి అపకార మంట?
రాజ్యాల విభజనము
గ్రామ స్వరాజ్యం మేరకు
అవునా కాదా?

తెలంగాణ ప్రదేశమంత
వేరే రాజ్యంగా వుంటే
భారత రాజ్యాంగానికి ముప్పొస్తద?
ఆ కోరిక వుండటయే దేశద్రోహమా?
తెలుగు భాషతో వైరమా?
ఇవి యన్ని దొంగమాటలేన కాదా?
ప్ర. తెలుగు మహాసభల ముసుగేసుక
‘తెలంగాణ’ ఏర్పాటు
ఆంధ్రప్రదేశ్ రాజ్యవిభజన
కోరికయే ద్రోహమ్మని
చాటించే అధికారం
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి
జలగం వెంగళరావుకు ఎవడిచ్చెను?
ఇది అధికార దుర్వినియోగంబౌనకాదా?
రాజ్యం విభజన కోరెడి వారందరు
భారతపౌరులు అవునా కాదా?
--
‘తెలుగుదేశ’ మను మాటకు
‘తెలుగుజాతి’ అనుమాట కర్థమో
మనందరది భారతజాతే జాతని
భారత దేశ మొక్కటే
మనమందరది భారతజాతే జాతని
భారత దేశ మొక్కటే
మన అందరి దేశమ్మని

భారతదేశం లోన
హిందీ భాషీయులంత
ఒక రాజ్యంలో లేరని
భారతీయులే వారని
తెలుగుబాస మాట్లాడే
వారుకూడా రెండు మూడు
రాజ్యాలుగా విడిపోతే
భారతదేశ సమైక్యత
భావం ఇసుమంతైనా కుంటుబడదు
అను సంగతి
తెలుగుజాతి
తెలుగుదేశంలోని వారికి
నచ్చజెప్ప విధమేది?
తెలిసి కూడ
రెండున్నర జిల్లోళ్లు
రెండు మూడు తెగలోళ్లు
చదువుకున్న కులపోళ్లు
రెండున్నర జిల్లాలదే
దండిబాస అని అంటే
అధికార మంత గూడ
తామే పంచుక తింటే
తక్కినోళ్ల నోళ్లయాస
తొక్కిపెట్టి నొక్కేస్తే
తిరగబడాల్నా వద్దా?

తెలుపండి నలిగెటోళ్లు

హైద్రాబాదు తెలుగుపట్న మోలె

లేదంటె అది తెలుగుజాతికె సిగ్గట

ఆ మహానుభావునకు తెలియదింక

హైద్రాబాదే కాదు ఆ మాటకొస్తే.

తెలంగాణ మరాట్వాడ

కర్ణాటక జిల్లాలతో వెలసినట్టి

ప్రదేశమంత వివిధ భాషలకూడలి

వివిధ సంస్కృతులకు కూడలి

మినియేచర్ ఇండియా

హైద్రాబాదను నగరం

నేటికి భారతమను మనదేశం

రూపానికి చిహ్నము, ప్రతీక.

జైహింద్  జై తెలంగాణ.

## వీర తెలంగాణ నాది

వీర తెలంగాణ నాది వేరు తెలంగాణ నాది

వేరై కూడా తెలంగాణ వీర తెలంగాణ ముమ్మాటికి

తెలంగాణవేరై నిలిచి భారతానవెలయు ముమ్మాటికి

వీర తెలంగాణము పైనంతో భారత పోరుని ధీధైర్యంతో

ప్రజావాణి నా గొడవ మిన్న ‘ప్రజా’ ప్రకటన జేస్తున్నది.

వీర తెలంగాణ నాది పేరు తెలంగాణ నాది.

పేర్మై కూడ తెలంగాణ వీర తెలంగాణ ముమ్మాటికి
తెలంగాణ పేర్మై నిలిచి భారతాన వెలయు ముమ్మాటికి.
దోపిడి జేసే ప్రాంతేతరులను
దూరము దాక తన్ని తరుముతం
ప్రాంతం వాడే దోపిడి జేస్తే
ప్రాణం తోసే పాతర వేస్తం

దోస్తుగ వుండే వారితో మేమును
దోస్తే చేస్తే ప్రాణం ఇస్తం.
‘ఎంతకు అంత’ అన్న నీతితో
చింత మాని బ్రతుకును సాగిస్తాం

తెలంగాణ ‘బాషిందా’ బ్రతుకు
తెలిపిన తరతరాల సత్యమిది
కన్నడులు మహారాష్ట్రులు తుర్కీ
అన్నయ్యల తరతరాలేరినది.
గుజరాతీ, మార్వాడి పారిసీ
గుజ్జన గూళ్ళు అనుభవించినది
కాబూలీ ఈరాని భాయిలకు
కనువిప్పగ మెలిగిన విధమిది.

తెలంగాణమిది తెలంగాణమిది
తీరానికి దూరాన ఉన్నది
ముంచే యత్నము చేస్తే తీరము
ముసుగును తానే తీరము తప్పక

జైహింద్ జై తెలంగాణ తెలంగాణ జిందాబాద్
భారతమాతాకీ జై తెలంగాణ జిందాబాద్.

## గుడుగుడు గుంచెం గుండే రాగం

ప్రభుత్వ రంగము రంగస్థలము
కలితీ మందుల కార్ఖానాలకు
అండదండలు అధికారులవి
లంచగొండులకు లంజెదిబ్బలకు
ఆసర అంతా ఆఫీసర్లది
సరుకు కరువుకు ధరల పెరుగుకు
సరకా రోరిడె ఘనకీరితి
జుప్పేబాజీ ఝూవ్ు షరాబీ
పోజుల అడుగున పోలిస్ ఘోరను
సారాబట్టి సరాబరాహికీ (సప్లయికి)
తంత్రం సొంతం మంత్రాంగానిదె
దగాకోరుల దర్జా బ్రతుకుకు

రక్షణ పోషణ ప్రభుత్వానిదె
హారెహా వహ్వారె ప్రభుత్వం
పేరుకు మాత్రం ప్రజల ప్రభుత్వం
ప్రజల దోపిడికి పబ్లిక్ సెక్టరు
పర్మిట్ కోటా పాచిక పందెం
పెత్తందారీ ఎత్తు జిత్తులకు
సత్తాదారుల సత్తువ ప్రాణము
గుడుగుడు గుంచెం గుండే రాగం
గూడు పుటానీ గుండా రాజ్యం
పాలక వర్గము   పడుపువృత్తుల
గిట్టుబాటుకు పెట్టని కోట
సేటు జేబులో సీటు పునాది
తిన్నగ జూస్తే ఎన్నిక హేళన
బ్యాలెట్ పేపరు బ్యా బ్యా బ్యా
బ్యాంకు నోటుకు బుల్లెటు ఆసర
వోట్ల మలుపుకు షాట్ల ప్రేలుడు
గుడు గుడు గుంచెం గుండే రాగం
గూడుపుటానీ గుండా రాజ్యం.

# రాష్ట్రపతి పాలనలో  ఆంధ్రప్రదేశ్ రాజ్యము

రాష్ట్రపతి పాలనలో
ఆంధ్రప్రదేశ్ రాజ్యము
రాణిస్తున్నది భేషుగ!
హెచ్.సి.యస్., వి.కె. ఆర్
ఏదంటే అది న్యూసు.
సి.పి.ఐ. సమగ్రతకు
సిద్ధము వేదిక వేడుక.
రంగా, తెన్నేటి, గౌతు
లచ్చన్నల ఆటకట్లు.
శ్రీరాములు దండంత బే
జారై రాజి పడద?
కాంగిరేసు వదల లేని
ఘనుల మార్పు ఎంతలోన?
సి.పి.ఐ కాంగిరేసు
ఎటు చేరితే దేశము అటు
తక్కినోరు ప్రజలు కారు
నొక్కితే మూస్తరు నోరు!
దేశము ఎల్లల కిప్పుడు
ఏ దేశము భయము లేదు
సైనిక దళాలు ఎప్పుడు
సై అంటే సై అంటున్నయ్.

ఆంధ్రంతట షూటింగు
అభ్యాసము మూడునెల్లు
అలజడిదారులు అందరు
అదుపులోకి వచ్చినారు
తిరుగబడిన నక్సలైట్లు -
విరుగడ పోయినారు
అయిదు జిల్లాల నుండి
అదనపు సైన్యం తరలెను
రాష్ట్రపతి పాలనలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము
రాణిస్తున్నది భేషుగ!!

## ఇందిర ఉవాచ

సధ్ింగ్ ఇస్ కన్‌సీడెడ్ నధ్ింగ్ ఇజ్ డినైడ్'
ఏదీ ఇవ్వబడలేదు ఏదీ కాదనలేదు.
రాజ్యాల విభజన ధోరణి
రాష్ట్రానికె ముప్పదెచ్చు
నిర్ణయాధి కారమంత నిక్కచ్చిగ ప్రభుత్వాంది
ప్రతిపక్షులది కాదు రహదారులలో తేలదు.
అలజడులకు లొంగినది అసలు ప్రభుత్వం కాదు

ప్రపంచంలో ఎటుచూచిన    ప్రళయ పరిస్థితి సూచన
ప్రతిరంగంలో అస్థిర    క్రాంతి భ్రాంతి రూపురంగు
క్లిష్టాతి క్లిష్ట పరిస్థితుల    లిస్టులో భారతదేశం
పడిపడని ఇరుగు పొరుగె ఎపుడు ఏమి చేస్తారు
భారతదేశం ప్రగతిభారమైన ఈర్ష ్యతోడ
ప్రతిపక్షులు ఎన్నికల్లో పరాభవము చెంది ఇపుడు
లేనిపోని సాకులతో    లేహాలని చూస్తున్నరు.
ప్రజలకు కష్టాలు కలవు    ప్రభుత్వాని కంత తెలుసు
అవకతవకలేమి లేని    ఆధిపత్యమే డున్నది
కాంగిరేసు గడియింను    కనివిని ఎరుగని విజయము
ఎన్నికైన రాజ్యం ఇది    తన్నుక పోలేరెవ్వరు
పోకిరి వ్యవహారాలకు    బూటక ఆర్భాటాలకు
బందులకు స్ట్రయ్కులకు    భయపడనూ సేనస్సలు
నాలుగు నెలల అలజడంత    నాకెరుకె అసలేమిటో
కొంతమంది నాయకులతో    ఇంతవరకె మాట్లాడిన
ఇంక కొంతమంది తోడ    ఇంకా మాట్లాడుతాను.
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సంబంధిత అంశాలన్నిటిపైన
సమగ్రంగ చర్చిస్తా శాంత పరిస్థితిలోన
అందాకా ఆ విషయం అసలే ఎత్తను పలుకను

బలవంతం జబర్దస్తీ    బాపతురాతలు వున్నె
బలవంతం జబర్దస్తీ    బాపతు ప్రకటనలున్నె
బలవంతం జబర్దస్తీ    బాపతు స్త్రైకులు వున్నె
బలవంతం జబర్దస్తీ    బాపతు బందులు వున్నె

సమగ్రాంధ్ర కావాలను జనుల అభిమతమ్ము బైట
పడకుండా ఆపినారు ప్రాంతమంత దుండగీళ్ళు
నెమ్మదిగా నిశ్చలంగ  నిర్ణయాను సారంగా
కేంద్ర ప్రభుత్వము తనిఖీ చేస్తున్నదంత

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నాయకులు  ఆవుదూడ గుర్తువారు
తప్పడు త్రోవలో పడిన  తప్పను గుర్తించినారు
భరతజాతి నిర్మాణము  పార్లమెంటులో జరుగును
బజారులో దానికొరకు 'బహసు' చర్య పనికిరాదు
బహుసంఖ్యలో సీట్లు గెలిచిన  ప్రభుత్వాన్ని
కాంగిరేసు అధికారము కాదనుట తప్పతప్ప
ప్రజాస్వామ్య రాజ్యాంగం  పరిపాలన కీయకున్న
భారతాన ఇంతకన్న పాపం మరోటి లేదు.
మళ్ళీ ఎన్నికల దాక మామాటె చెల్లవలెను
మమ్ముల నెదిరించు దమ్ము మచ్చుకు లేదెవ్వరికీ
విదేశీయ గోప్యదళం  విన్యాసం సాగదిచట.------------------------

## నన్నే కాదంటే ఎట్ల?

నా ఓటుకు పుట్టినన్నె
కాదంటే ఎట్ల కొడుక?
మా ఓట్లకు పుట్టి మమ్మె

కాదంటే ఎట్ల కొడుక!

మా అభిమతమును కాదను
మందబుద్ధి మదోన్మత్త!
ప్రజాసామ్య హంతకుడా!
భారత రాజ్యాంగ ద్రోహి!

సీటంటే చేటు గూర్చు
చీటి అనుకుంటెట్ల కొడుక!
తినేదోమో మొగని సొమ్ము
పాడు పాట మిండనిదా?

ప్రజాకోటి బ్రతుకులతో
చెలగాటము చేయి చెనటి
గడెసెక్కు గణ శ్రేయము
సుద్దెరుగని ముఠామనిషి

మా మధ్యన వచ్చి నిలుచు
మాత్రము ధైర్యము లేదా?
ఎం.పి.వా లేక నీవు
ఇందిరమ్మ చిలుకమ్మవ?

పార్లమెంటులో సభ్యుడ!

పౌరుడవా? పోరడివా?
భారతీయ రాజ్యాంగం
బద్ధుడవా? ఇందిర బంటువ?

పెత్తందారీ రాజుల
సత్తా గుత్తా దారుడ
ఒకే జట్టు ఒకే సేత
బుకాయింపు గులాపోడ
భరత భూమిలో సత్తా
ప్రజలదన్న మాటెరుగవ
ప్రధానమంత్రి కన్న ముఖ్యమంత్రి కన్న
ప్రజలే కద ఎన్న మిన్న
ప్రజాభీష్టము కనుగొను
పాటియైన బుద్ధిలేద
పార్టీ వ్రత్యము పేరట
ప్రజలకు ద్రోహం చేస్తువ?
గౌరవ నీయుడవని ని
న్నే తీరుగ పిలువగలను?
ఇందిర బూట్లది రాజ్యం
ఏ సూత్రం అనుసరించి

ప్రజలను మోసము జేసెడి
పరమ నీచుడా ఖలుడా?

నిలువెల్ల విషము తోడ
నీల్గెడి అధమాధముడ
తరతరాల క్షేమానికి
క్షరము కూర్చ ఆతతాయి
తెలంగాణ ప్రజల మీద
తీరని కసి ఎన్నాళ్ళది
ఏనాటిది ఏనాటిది
ఈ తీరుగ పూనిన పగ

నా ఓటుకు పుట్టి నన్నే
కాదంటే ఎట్ల కొడుక? ---
తినేదోమో మొగని సొమ్ము
పాడు పాట మిండనిదా

## ఇందిరా ప్రజాస్వామ్యం

చట్టంతో చుట్టరికం
చలాయిస్త మంటున్నరు
కసితో కాట్లాడు కొనుచు
కలిసి వుండ మంటున్నడు.

పదహారేళ్ళను భవము
ఫలితము ఏమైనట్లు?

ఆంధ్ర తెలంగాణ మధ్య
ఆత్మీయ తెంతెదిగినట్లు?
వైరము తగ్గింప మైత్రి
వనరులెన్ని వెలసినట్లు :
వారి వీరి మధ్య కొత్త
వైరమెంత పెరిగినట్లు?

ఇండియా వ్యవహారమంత
ఇందిరమ్మ ఇష్టమేనా?
శాసన సభలకు తమ తమ
సలహా సత్తువ లేదా?

ముఖ్యమంత్రులంత ప్రధానమంత్రికు బంట్లా?
ముఖ్యమంత్రులకు మంత్రులు బంట్లా?
మా ఓట్లకు పుట్టి ఇపుడు
మమ్మే కాదంటారా?

సవ్యమైన ప్రజామతము
సాగాలన్నరు    అంటారు
రాజ్యాంగం ఆసరాతో
రాజ్యం ఏలెడి స్వార్ధులు
ప్రజామతము కాదనుచు
ప్రగల్భాలు చేస్తారు.

మళ్ళీ ఎన్నిక దాకా
తామన్నదె న్యాయం అని
సి.ఆర్.పి. ఆసరాతో
చేస్తం అంటరు పాలన
ప్రజాస్వామ్య శీలులెవరు
ప్రజామతము ధీరులెవరు
ప్రజాద్రోహ పాలనమును
సజావుగా సాగనీరు

## ఒట్లు   షొట్లు

ఒట్లు ఒట్లు తెలంగాణ
ప్రజలు ఒట్లు వొకవైపు
షొట్లు షొట్లు ఆంధ్రప్రదేశ్
రాజ్యం షొట్లు మరోవైపు

ఒట్లేమో తెలంగాణ
ప్రత్యేకం అంటున్నై
షొట్లేమో ప్రేలి ప్రేలి
ఒట్లను చంపేస్తున్నై

అసలు ఒట్లు ఎన్నున్నై?

అసలు షాట్లు ఎన్నున్నై?
'షాట్లు' అన్ని ప్రేలి తుదకు
ఎన్ని ఓట్ల చంపేసై?

షాట్లు అన్ని ఒడిసినాక
మిగిలిన ఓట్లెన్నుంటై?
జైహింద్ జై తెలంగాణ
తెలంగాణ జిందాబాద్.
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

ప్రజాస్వామ్య రాజ్యాంగం
పాలనగల భారతాన
సైన్టీన్ సిక్స్టీసైనులో
ఓట్లకు షాట్లకు సమరం

ఓట్లు ఓట్లు షాట్లు షాట్లు
ప్రజల ఓట్లు ప్రభుత్వ షాట్లు
జైహింద్ జై తెలంగాణ
తెలంగాణ జిందాబాద్.

# పార్లమెంటు ఎందులకు?

ఇందిర కిష్టం లేదట

ఇంకెక్కడి తెలంగాణ

ఎందరెంత జెప్పితేమి

ఇందిర కిష్టం లేదట

ఇంకెక్కడి తెలంగాణ

శంకరు దయాళుశర్మ

ఇందిర ఇష్టం అంటాడు

రాష్ట్రపతి వెంకటగిరి

ఇందిర ఇష్టం అంటాడు

మాజీ ముఖ్యమంత్రి ఇప్పటికీ

ఇందిర ఇష్టం అంటాడు

సిపిఐ కామ్రేడు

విభజన నష్టం అంటాడు

ద్వేషం, జగడం, అలజడి

తగ్గి పోవాలంటదు

ఎందరెంత చెప్పితేమి

ఇందిర కిష్టం లేదడ

ఇంకెక్కడి తెలంగాణ

గుండ్ర బల్ల కాన్ఫరెన్సు

గూడుపుఠానీ చర్చలు

విభజన వద్దని తేల్చగ

తతంగాలు    కుతంత్రాలు

అందరి దొకటే ఘోషణ

'ఇందిరకిష్టం' లేదట!

ఇంకెక్కడి తెలంగాణ

ఇందిర అంటే కాంగ్రెసు

ఇందిరయే సోషలిజం

ఇందిర అంటే ఇండియా

ఇంకెక్కడి తెలంగాణ

ప్రజాస్వామ్య దేశంలో

రాజ్యం చేసే ఇందిర

డూ డూ బసవన్నలంత

ఇంకెక్కడి తెలంగాణ

పార్లమెంటు ఎందులకు

ప్రజల మాట ఎందులకు

అందరి దొకటే ఘోషణ

ఇందిరకిష్టం లేదట

ఇంకెక్కడి తెలంగాణ

-

# జాజిరి జాజిరి జాజిరి జాజా

జాజిరి జాజిరి జాజిరి రాజా

ఆవూ దూడా కాంగ్రెసు బాజా

పార్టి గాదురో పార్టీ ప్రత్యం

దొరలు గాదురో దోపిడి దొంగలు

దేవత గాదుర దొంగల రాణి

ఇందిర తొత్తుల గూడుపుఠాని

జాజిరి జాజిరి .................

ఓట్లది గాదురా సేట్లది రాజ్యం

ఓట్లది గాదురా నోట్లది రాజ్యం

ఓట్లది గాదురా షాట్లది రాజ్యం

జాజిరి జాజిరి .................

సత్యాగ్రహులను చంపే రాజ్యం

ఓట్లను షాట్లతో మలిపే రాజ్యం

సమ్మెల బూట్లతో అణిచే రాజ్యం

రాముని పేరిట రావణ రాజ్యం

హిట్లరు నడక ఇందిర రాజ్యం

జాజిరి జాజిరి ..................

ప్రజలది రాజ్యం సర్కారెవ్వరు
పల్లెది రాజ్యం ఢిల్లీ ఎందుకు
మందకాదురో మనుషుల గుంపు
గుండాలెవ్వరు ప్రజలూ పౌరులు
జాజిరి జాజిరి.....................

ఇంటి గుట్టుకు ఇందిర ఎవ్వరు
పరిపాలనకూ పటాల మెందుకు
చింత చిగురుకూ చీటి ఎందుకు
ఏరు పిడుకలకు బేరాలెందుకు
జాజిరి జాజిరి ....................

ఢిల్లీరాణి మాస్కోరాజా
కలగాపులగం మస్కా తాజా
గాంధీ సమాధికి హిట్లరు పూజా
జాజిరి జాజిరి......................

ఆవూ దూడా కాంగ్రెసు బాజా
రాట్నం గిరగర కొడవలి కోతా
నడిస్తే రష్యా మడిమెల మోతా
ప్రజల ప్రభుత్వం యాహ్యా చేత
మార్షల్లాకు ఇందిర పూత
జాజిరి .......................

ఢిల్లీ పట్నం పల్లెకాదురో

ఇందిరగాంధీ గాంధీ కాదురో

మంత్రికాదురో ప్రధానమంత్రి

మనిషి కాదురో కామినిభూతం

జాజిరి జాజిరి ....................

కాంగ్రెసు ముసుగుతో కామరేడులు

సానివాడలో సావిత్రకథ

తెల్లని తెరలో నల్లబజారూ

రాముని పేరట రావణరాజ్యము

శ్రీమతి గాంధీ సీరంగ నీతులు

జాజిరి జాజిరి ...................

శ్రీరంగ నీతులు తాజా తాజా

''పేర్పడి బ్రతికితే వంశం పాడు

ఇండ్లు పెరిగితే వాడలు పాడు

వాడలు పెరిగితే ఊరే పాడు

ఊళ్లు పెరిగితే పట్టే పాడు''

శ్రీమతి గాంధీ సీరంగ నీతులు

జాజిరి జాజిరి ...................

--

గ్రామ స్వరాజ్యం జనులకు కీడు

పంజుల రాజ్యం దేశం బీడు

రాజ్యాలు పెరిగితే దేశం పాడు

శ్రీమతి గాంధీ సీరంగ నీతులు

జాజిరి జాజిరి ..................

పీకులాటకు తెగతెపొద్దట

పడిపడకున్నా కలిసుండాలట

విడిపోతేనే చెడిపోతామట

శ్రీమతి గ్రాంధీ సీరంగ నీతులు

జాజిరి జాజిరి ..................

పంక్తి భేదము ఉంటేమానే

మోహిని వడ్డన చేస్తేమానే

కష్టం నష్టం జరిగితే మానే

ఇష్టం లేకేడుస్తే మానే

యారాళ్ళ సిగపట్లను ఓర్చుక

కోపం మానీ మనుసులు మార్చుక

అన్నదమ్ములు కలిసుండాలట

శ్రీమతి గాంధీ సీరంగ నీతులు

జాజిరి జాజిరి ..................

ఆంధ్రులు మనమూ కలిసుండాలట

ఆంధ్రప్రదేశం వెలిసుండాలట

దోపిడి మార్గం తెరిసుండాలట,

ముల్కీ మస్లా మెడ నులుమాలట

ఇందిర మాటకు ఎదురే లేదట
కాదంటే దేశం నాశనమౌనట,
శ్రీమతి గాంధీ సీరంగ నీతులు
జాజిరి జాజిరి ..................

వీధిల ప్రజలు అలజడిదారులు
వీధిల ప్రజలు గుండాలందరు
పార్టీ సభ్యులు సత్తుపిత్తులు
ప్రజల ఓట్లకు పుట్టిన పెద్దలు
ప్రతిపక్షాలైతే దేశద్రోహులు
శ్రీమతి గాంధీ సీరంగ నీతులు
జాజిరి జాజిరి ..................

పడి పడకుంటే మగణ్ణి వదలిన
ప్రసక్తి ఎత్తే ప్రశ్నే లేదట
శాస్త్రం చెప్పే సాముల భార్య
చాకలయ్యతో సరసాలాడితే
క్రొత్త నమోనా నోమూ ప్రతమట
శ్రీమతి గాంధీ సీరంగ నీతులు
జాజిరి జాజిరి ..................

పొత్తుల బేరం పిత్తుక జచ్చి
దానికి దీనికి సిగపట్టొచ్చే

హామీలన్ని మంటల గలిస్తే
అన్నదమ్ములకు అగచాట్లొచ్చే
ఆప్రా రాజ్యం ఆగంబాయె
జాజిరి జాజిరి ..................

గరీబి హటావ్ గప్పాలమ్మా
ఢాకిని శాకిని డాకూలమ్మా
నల్ల బజారు గాంధీబొమ్మా
కల్తీసారా సర్కారమ్మా
విషపు చేపులా చనుబాలమ్మా
బహురూపులది దయ్యాలమ్మా
తప్పుడు కూతల తంటాలమ్మా
సాకుల మేటి బొంకుల బొమ్మా
అంతర్వాణీ అక్కర్లమ్మ
రంకు రాజకీయాలది రిమ్మ
జాజిరి..................

--

## పోదాం పదరా ! !

పదరా పదరా పోదాం పదరా
తెలంగాణ సాధిద్దాం పదరా

దొంగల దూరం కొడదాం పదరా

పేరే రాజ్యం చేద్దాం పదరా ||పదరా||

షాట్లకు బెదరక చెదరక పదరా

హిరణ్యకశిపుడు హడలగ పదరా

నర్సింహుడవై ముందుకు పదరా

పదరా పదరా .................... ||పదరా||

అధికృత హింసనే పాలన అంటే

ప్రహ్లాదుని హేళన చేస్తుంటే

ప్రత్యక్షంగా నర్సింహులమై

ప్రతిహింసకు పాల్పడదాం ||పదరా||

హిరణ్యకశిపుల పొట్టలు చీల్చి

పేగుల మాలలు చేద్దాం పదరా

పదరా పదరా ..................

పేర్పడదామని ఇద్దరికుంటే

కాదను వారిని కాలదన్నమా

పేరే రాజ్యం చేయబూనమా

పదరా పదరా ..................

# ఓట్లన్నీ ఒకవైపు

ఓట్లు ఓట్లు ప్రజాస్వామ్య

ఓట్లన్నీ ఒకవైపు

షాట్లు షాట్లు ఫాసిస్టుల (ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం)

షాట్లన్నీ మరోవైపు

ఓట్లేమో పేరు పేరు

రాజ్యాలు అంటున్నై

షాట్లేమో ప్రేలి ప్రేలి

ఓట్లను మలిపేస్తున్నై

షాట్లు ప్రేలి అయిపోతే

ఓట్లు మిగిలి పాలిస్తే

ఆంధ్ర    తెలంగాణ పేరు

రాజ్యాలై రాణిస్తే

జై జై జై తెలంగాణ

జై జై జై ఆంధ్ర

డయ్యర్ ఖాసింరజ్వీ

డౌను డౌను, డౌను డౌను

ప్రజాస్వామ్య సార్వభౌమ

రాజ్యాంగం జై జై జై

జైహింద్, జైహింద్, జైహింద్

జై జనగణ జై జై జై జై

# అన్యథా శరణం నాస్తి

ప్రాంతం వారీ రక్షణ

పనికిరాదు అన్నప్పుడు
ప్రత్యేకంగా రాజ్యం
పాలు కోరడం తప్పదు.
ముఖ్యమంత్రి ఆదర్శం
ముతాతత్వమైనప్పుడు
ముల్కీమంత్రులు సైతం
ప్రధానమంత్రికి బంట్లు ఐనప్పుడు ||ప్రత్యేక||
-

బూర్గు నాటి ఒప్పందం
బుట్టదాఖలైనప్పుడు
విన్నపాలు విజ్ఞప్తులు
విను నాధుడే లేనప్పుడు ||ప్రత్యేక||

తెలంగాణ సిబ్బందిది
''త్రిశంకు'' గతి అయినప్పుడు
''బాసచాన'' వయ్యారం
యాస కంటు అయినపుడు ||ప్రత్యేక||

మాండలికపు మర్యాదల
మాటలు చేదయినప్పుడు
''బాలానందం'' కోస్తా
బాలల సొమ్మైనప్పుడు ||ప్రత్యేక||

తెలంగాణ రాళ్ళసీమ
వెలిపాలై వున్నప్పుడు
పక్షపాత బుద్ధిలేని
పాటిచేత లేనప్పుడు ||ప్రత్యేక||

రెండున్నర జిల్లాలదె
దండిబాస అయినపుడు
తక్కినోళ్ళ నోళ్ళయాస
నొక్కి పెట్టబడ్డప్పుడు ||ప్రత్యేక||
మోజేతి గంచితతికి

మోసం జేసెడి నేతలు
ప్రజల మెప్పు కోలుపోయి
ప్రమాదాల పాలగుదురు.
ప్రాంతవారీ రక్షణ
పనికిరాదు అన్నప్పుడు
ప్రత్యేకంగా రాజ్యం
పాలుకోరడం తప్పదు.

# ప్రాంతం వాడే దోపిడి చేస్తే . . . . . .

దోపిడి చేసే ప్రాంతేతరులను

దూరం దాకా తన్ని తరుముతం

ప్రాంతం వాడే దోపిడీ చేస్తే

ప్రాణంతోనే పాతర వేస్తం

దోస్తుగ ఉండే వారితో మేమును

దోస్తే చేస్తం --ప్రాణమిస్తం

ఎంతకు అంత అన్న ధోరణిలో

చింతమాని బ్రతుకును సాగిస్తం

తెలంగాణమిది  తెలంగాణమిది

తీరానికి దూరాన వున్నది

ముంచే యత్నం చేస్తే తీరం

మునుగును తానే  మునుగును తప్పక

# ప్రతినిధుల సభ

తెలంగాణ పెద్దల సభ జరుగుతాంది

జతల జతల ఎద్దులన్ని చేరినాయి

ఏ దొడ్లో ఉండాలో

తీర్మానం చేస్తాన్నయ్.

విశాలాంధ్ర దొడ్డిలోన
విరిగిన కాళ్ళను లెక్కిస్తున్నయ్
విశాలాంధ్ర దొడ్డిలోన
కుమ్మిన ఆంబోతుల స్మరిస్తున్నయ్.

న్యాయం నాల్గుపాళ్ళు నడవని
తీరుకు, హామీ ఉండాలంటున్నవి
పయ్యెద్దు    ఎల్లెద్దూ
దొంగెద్దూ    గజ్జెద్దూ
దొంగెద్దూ    దొరకోడే
అన్నీ రంకెలు వేస్తూ
తీర్మానిస్తున్నవి.
కట్టుబాటు లేని తీరు
దొడ్డిదారి చూస్తున్నవి
ఏ పనగడ తీసుంటే
ఆ దొడ్డే మాదని
ధోరణి కనిపిస్తున్నది.

తెలంగాణ ఎడ్లన్నీ
కటికవారి కమ్ముకడైన తీరుని
ఉమ్మడి దొడ్లో విధిగా
విచారిస్తున్నవి.

ఉమ్మడి సభ జేసినపుడు

తవుడు కుడితీ ఉండేదట

తెలంగాణ ఎద్దుల సభ పేరైనప్పుడు

--

పచ్చినీళ్ళు కరువేనట

ఈ తీరులో భేదం చాలద

సమైక్యత వమ్మైందనుటకు

ఆ ఎద్దూ ఈ ఎద్దూ అంబా అంటున్నా

జీవరాశి ఆరాటం

స్వేచ్ఛా జీవన పోరాటం

ఎద్దు బ్రతుకు

ఎద్దేవన కాక ముందు

మంచి బ్రతుకు మనగల్గేందుకు

పేరు దొడ్డి పెట్టాలని

లేగలు, కోడెలు ఆరాటం

చెందుతుండ

ఇరువది ఏడెడ్లతో

పద్దు సంఘమేశాయట

గుడ్డ గుడ్డ కరుచుక

దొడ్డి పీకి పేస్తాయట

ఎన్నికైన ఎద్దు గొడవ

మళ్ళీ టిక్కటు కొరకే తప్ప

ఎదగని బుద్ధికి మతి

ఎద్దేవం కాదా మరి!

## ఇప్పుడు తెలిసొచ్చింది

హామీ ఒప్పందాల
డ్రామాకు మోసపోయి
ఆంధ్రప్రదేశ్ రాజ్యమ్మ
అందరికీ క్షేమంబని
ఒప్పుకున్న 'తెలంగాణ'
కిప్పుడు తెలిసొచ్చింది.

కోడ దూడను ఒకే కాడికి కట్టొద్దు అనిన
ఫజల్ ఆలీ కమీషను
భావి దర్శన విశిష్టత
''గ్రామ పంచాయితి'' ఎన్నిక
గడువు దాటిపోతుంటే
ఏడాది గడువు పెంచు
పేడిది రాజ్యము కాదిది
పెట్టించు, పెట్టించు
పెట్టించు ఎన్నికలు
తాడో పేడో తేల్చేడి

జాడకు అడ్డము రాకు.

పంచాయితి రాజ్యము
''పంజ్''ల ఎన్నికతోనే
తెలంగాణా అటో ఇటో
తేటతెల్లమైపోవును

కోటిన్నర మేటి ప్రజల
గొంతొక్కటి గోడొక్కటి
తెలంగాణ వెలిసి నిలిచి
ఫలించాలె భారతాన.
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## ఎన్నికలు జరిపించు

ప్రత్యేక తెలంగాణ
పనికిరాదు అంటారా?
ప్రత్యేక తెలంగాణ
రానే రాదు అంటారా?

ప్రధానమంత్రి పల్కు ముఖ్యమంత్రి పల్కు

రాగము తాళము ఒకటా?
ప్రధానమంత్రి, ముఖ్యమంత్రిలు చెవులొగ్గి
ప్రజల పల్కు వినలేరా?

ప్రజల పలుకు లాలించెడి
బాధ్యత వారికి లేదా?
రాజ్యాన్ని విభజిస్తే
ప్రజకు ముప్పు వస్తుందా?

'ప్రత్యేక తెలంగాణ'
ఫజల్ అల్ కమీషన్ తేల్చలేదా?
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పుట్టుకకు
అసలు కారకుల ఎవరు?

హామీ ఒప్పందాల
డ్రామా నాడింది ఎవరు?
బ్లాంక్ చెక్కు ఇస్తామని
బాకాలూదింది ఎవరు?

పన్నెండేడులు ముఖ్యమంత్రులది
బాధ్యత గల పాలననేన?
పార్టీప్రత్యము పేరట
పాపము దాచిన దెవ్వరు?

ప్రాంతాన్ని అణచిపెట్ట
రాజ్యాంగం ఒప్పుకున్నద?
పార్టే దేశము అనుకొను
ప్రధానమంత్రిల రీతి భద్రంబా?

ముడాదే రాజ్యమ్మను
ముఖ్యమంత్రుల రీతి క్షేమంబా?
చెల్లని ఒప్పందంపై
అస్తిత్వం చెల్లుననుట
అమాయకతా? దాదాగిరా?

రాజ్యాంగం రాణించగ
గ్రామగ్రామమున 'మే'లో
జరుగనున్న ఎన్నికలను
జరుగనీయనిది రాజ్యమా.

గ్రామ పంచాయితి ఎన్నిక
ప్రధానమంత్రి, ముఖ్యమంత్రులు జరిపిస్తే
తెలంగాణ అటో ఇటో
తెలియవచ్చు క్షణంలోను.

ప్రజాస్వామ్య రాజ్యాంగం

ప్రవర్థిల్లు సాధనమితి
ప్రధానమంత్రి, ముఖ్యమంత్రుల నిజాయితీని
పరీక్షించు మార్గము ఇది.

ఏడాదీ పొడిగించిన
గూడుపుఠానీ ఆజ్ఞను
రద్దు చేసి పంచాయితి
రాజ్యపుటెన్నిక జరుపుడు.

గ్రామ ప్రజలు, జానపదులు
ప్రజాస్వామ్య సార్వభౌమ
రాజ్యం సత్తాధికార్లు
పూజ్యులు తేలుస్తారు.
తెలంగాణ అటో ఇటో
తేట తెల్ల పరుస్తారు.

ఫజల్ అల్ కమీషన్ సూచనల
ఫలితాంశము బైటబడును
హామీ ఒప్పందాల
డ్రామా పస బైటబడును.

ఓట్ల తోటి తీరుదాన్ని
షాట్ల దాక రానిచ్చుట

ప్రధానమంత్రి కైన ముఖ్యమంత్రికైన
రాణంచదు రాణించదు

ప్రజాస్వామ్య రాజ్యాంగం
రహదారి చీట్లు - ఓట్లు
ప్రజాస్వామ్య రాజ్యాంగం
ప్రాణహానికరము ‘షాట్లు’

## భారత రాజ్యాంగం

మనువు ధర్మశాస్త్రమైన
బైబిల్ ఖురానులైన
ఇంకే మత శాస్త్రమైన
ఏలుతు లేదు మనల్ని.

భారత రాజ్యాంగమెకటి
పౌరుల శాసిస్తున్నది.
రాజ్యాంగమునకు హాని
లక్షించెడి కూత, చేత
పౌరుల నవమానించెడి
పాటి శక్తి సామర్ధ్యము
ఎవనికుంది, ఎవనికుంది?

ఈ రోజున భారతాన?

ఎవ్వడన్న ఉన్నదంటె
ఎవ్వడన్న అనుకుంటే
ఉన్నదనుకొని కూస్తే
ఉన్నదనుకొని చేస్తే
కోర్టు కీడ్చి బుద్ధి చెప్పి
గుణము గరపవలసిందే.

ప్రధానమంత్రికైన ముఖ్యమంత్రికైన
ప్రజాకవి సామ్రాట్టుకైన
బైబిల్, ఖురాను, మనుపు
బాపతు గురుపెవనికైన
పౌరుల నవమానించెడి
పాటి శక్తి సామర్థ్యము
ఎవనికుంది ఎవనికుంది
ఈ రోజున భారతాన?

ప్రజాస్వామ్యమున పేలము
పాట, బడితే, పాలి ఓట్లు
ప్రజాస్వామ్యమును నేతల
మజా దీర్చుటకు సీట్లు
పార్టీ పార్టీలో ముఠా

పోటిదేన నిజాయితీ?
ప్రభుత్వాధికార బలము
పార్టీ 'కుతి'కా ఆహుతి?
ప్రజాస్వామ్య రాజ్యాంగం

పరీక్షించు గీటురాయి
కోటిన్నర మేటి ప్రజల
గొంతొక్కటి, గొడవొక్కటి
తెలంగాణ పెలిపి నిలిచి
ఫలించాలె భారతాన.
భారత మాతకీ జై
తెలంగాణ జిందాబాద్.

ఎవడు వాడు తెలంగాణ
నీసడించ దలచినోడు
ఏ పదవిలో వుండి నన్ను
హేళనగా చూస్తున్నడు?

రాజ్యాల విభజనకు
రస్తా లేనే లేదా?
రాజ్యాల విభజనకు
రాజ్యాంగం ఒప్పుకొనదా?

కేంద్ర ప్రభుత్వము పార్టీ
క్రీనీడల నడవడి దా
ఉన్నత పదవుల జేరి
ఊసరవెల్లి విధానామా?
భారత పౌరుల హక్కుల
భంగపాటు తొలగింపగ
భారత రాజ్యాంగములో
బందోబస్తే లేదా?

నలుబదేడు కోట్ల ప్రజల
నాయకుడు, భారతాని
కధ్యక్షుడు, రాజ్యాంగం
అమలు బావుటా 'జాకిరు'
కోటిన్నర మేటి ప్రజల
గొంతొక్కటి గోడొక్కటి
తెలంగాణ వెలిసి నిలిచి
ఫలించాలె భారతాన
భారతమాతాకి జై
తెలంగాణ జిందాబాద్.

# ఓ శాసన సభ్యులారా !

కాడెద్దుల ముద్దెరతో
నాడు సీట్లు గెలుచుకొన్న
ఓ గౌరవనీయులారా!
ఓ శాసనసభ్యులారా!

మీ మీ ఓటర్లు మిమ్ము
మీ నియోజకాల యందు
వెతుకులాడుతున్నారు.

పేరు మతము బూని యిపుడు
మీరేమో పట్నంలో
పేరు తెలంగాణొద్దని
పత్రికల్లో జోరుదారు
ప్రకటనలు చేస్తున్నారు.

ఊళ్ళల్లో వీరజనులు
ఊరేగింపులు దీస్తూ
తెలంగాణా పేరుపడి
నిలవాలని కోరుతాండ్రు.

గ్రామ గ్రామమున తిరిగి

గ్రామీణుల మతము నరసి

నా గొడవ మరియాదగ

సాగదీసి అడుగుతాంది

ఓ గౌరవనీయులార!

ఓ శాసనసభ్యులార!

ఓటర్ల మతమేమిటో

సీటర్లు తెలుసుకొనక

ప్రకటించే ప్రకటనలకు

ప్రజాస్వామ్య స్థాయి ఎంత?

ప్రాతినిధ్య పరపతెంత?

--

కాంగ్రేసుదే రాజ్యమా?

కాడెద్దులదే బలగమా?

ముఠా కుమ్ములాటె బ్రతుకా?

మోజేతి గంజే మెతుకా?

ఓ గౌరవనీయులారా?

ఓ శాసనసభ్యులారా?

ఏ బ్రహ్మము గారడి యది?

ఏ రాజకీయ వైఖరి యిది?

ఏ రాజ్యాంగ సూత్రం యిది?

ఏ ప్రజాహిత కార్యం యిది?

జైహింద్ జై తెలంగాణ

తెలంగాణ జిందాబాద్స

భారత్ మాతాకి జై

తెలంగాణా జిందాబాద్.

జైహింద్ జై తెలంగాణ

తెలంగాణ పితామహా!

తెలంగాణ హిత చింతక!

తెలంగాణ ఉద్ధారక

తెలంగాణ జిందాబాద్.

తెలంగాణ స్థితిగతులను

తెలంగాణ ప్రజల వ్యధను

తెలిసి చెప్పుచున్న తాత

తెలంగాణ జిందాబాద్

ప్రత్యేక తెలంగాణ

ప్రసక్తే లేని ప్రధానమంత్రి

పిలుపును విన ననిన వీర

తెలంగాణ జిందాబాద్

కనులు, చెవులు వుండి కూడ
కనని వినని వారెందుకు?
తెలంగాణ ధీమంతుడ?
తెలంగాణ జిందాబాద్.

కాడెద్దుల ముద్దెరున్న
'కాసు' గులాపోళ్ళెందుకు?
కనని కండ్లు వినని చెవులు
గల ముల్కీ మంత్రులేల?
నిజా నిజము లరసి తెలిసి
నిజమును చాటించి చెప్ప
ధీరుడు ధీమంతుడొకడు
తెలంగాణా పితామహుడు
తెలివొక్కటి వుంటె చాలు
తెలంగాణ తాతయ్య
తెలివుంది తెలంగాణ
తెస్తాము తాతయ్య
తెస్తాము నీవుండగ
తెలంగాణ తాతయ్య
జైహింద్ జై తెలంగాణ
తెలంగాణ జిందాబాద్

# అయ్యయ్యో ఆంధ్రావని!!

అంధ్రప్రదేశము కాదిది
బ్రహ్మానంద విచిత్రపురి
ఆనంద నిలయము 'దాదా'
అదుపులోన ఆంధ్రావని.

మూడుసాళ్ళ మంత్రులంత
ముఖ్యమంత్రి 'కాసు' బంట్లు
'విస్సన్నన్నదే వేదము'
విశ్వాసముగల స్టంట్లు.

కాడెద్దుల ముద్దెరతో
నాడు సీట్లు గెలుచుకొన్న
గౌరవనీయులు ఎందరో
'అవునులు' ముఖ్యమంత్రి అయినోరికి

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు
ఆంధ్రప్రదేశ్ రాజ్యము కాంగ్రెసు
రాజ్యమని తలుస్తాండు
రాజ్యాంగమ్మ తడెరుగడు.

ముఠా రాజకీయాల

ముల్లె పెంపకాలల్లో
హాటా కోటా పేచీ
పాటిదిపుడు ఆంధ్రావని.

ఆంధ్రప్రదేశము కాదిది
బ్రహ్మానంద విచిత్రపురి
ఆనంద నిలయము 'దాదా'
అదుపులోన ఆంధ్రావని.

ముతాకోరు అయిన ముఖ్యమంత్రి
హుటాహుటిగ ఢిల్లీ నుండి
ట్రంక్ టెలీఫోన్ మాటల
'లింకుల' కాదేశించెనా?
ఆంధ్ర రాజధానిలోనే
నడుగిడు లోపల మీరు
మీ మీ జిల్లాల కరిగి
ఇట్లిట్లని అంతా కని
--
హైద్రాబాదులో మళ్లి
హాజరు కమ్మన్నాడా?

వరంగలు ఆ మాదిరి
వక్రా 'చారుడు' ఒకడు
వచ్చి వార్ని వీర్ని కలిసి

ఇచ్చకాలాడేగినాడా?

ఆంధ్రప్రాంతులగు కొందరి
నాదరించి ఇకమీదట
మీరే దౌర్జన్యాలకు గురి
కారని చెప్పినాడా?

ఇకమీదట నాటకమున
ఒకటే రంగము దానిలో
రేళ్లు    పోస్టు దహనాలూ
రేగిస్తామన్నాడా?

ఆనాటినుండే రేళ్లు
అచటచట ఆగె కాలె
ట్రంకు టెలిఫోను కాలుల
లింకులదేనా ఇదంత?

రేల్వే వారోత్సవాల
ముఖ్యమంత్రి సంభాషణ
లోని స్ట్రెస్సు గమనిస్తే
లోక విదితమగు సర్వము
అయ్యయ్యో ఆంధ్రావని
అయ్యయ్యో ఆంధ్రావని

## ప్రాంతం వాడే దోపిడి చేస్తే

దోపిడి చేసే ప్రాంతేతరులను

దూరం దాకా తన్ని తరుముతం

ప్రాంతం వాడే దోపిడి చేస్తే

ప్రాణంతోనే పాతర వేస్తం

దోస్తుగ ఉండే వారితొ మేమును

దోస్తే చేస్తం – ప్రాణమిస్తం

ఎంతకు అంత అన్న ధోరణితో

చింతమాని బ్రతుకును సాగిస్తం

తెలంగాణమిది – తెలంగాణమిది

తీరానికి దూరాన వున్నది

ముంచే యత్నం చేస్తే తీరం

మునుగును తానే – మునుగును తప్పక

కాళోజి

## రావి నారాయణ రెడ్డీ !

వీర తెలంగాణ సమర

వీరాగ్రేసర? రావి? ఆంధ్ర

మహాసభల మేటిప్రజల

మనిషి ప్రాణ సఖుడ?

నారాయణ! నారాయణ!

తీరా యీనాడు నీవు

ఏమిటి మాట్లాడునది?

ఏ 'ఘరాన' పాట ఇది?

'ఆంధ్ర మహాసభను' రెండు

ఆంధ్ర మహాసభల జేసి

'తెలంగాణ' తెలుగన్నల

తెలివి, బలము పెంచె నెవడు?

'చీలికలే' అభివృద్ధికి

తేలికైన మార్గాలని

'చీలికలే' అభివృద్ధికి

మూలికన్న పేది ఎవడు?

వందలేండ్లు తెలంగాణ

మంది పేరుగున్నప్పుడు

తెలంగాణ తెన్గు తనము

-

దినుసు గుణము పోయిందా?

కృష్ణ దేవరాయలెవరో?

కృష్ణమూర్తి శాస్త్రి ఎవరో?

తెలియకనే వున్నారా?

తెలంగాణ కితాబీలు

నన్నయ్య తిక్కన

నారాయణభట్టు లెవరో?

ఆంధ్రప్రదేశ్ రాజ్యము వెలయగ
అందినదా ‘కబురు’ మనకు
సినీ పాట గమ్మత్తుల
‘సిసారె’ మన తమ్ముడు
‘వీర తెలంగాణ నాది
పేరు తెలంగాణ కాదు’

అన్న మాటలను
అన్నా! నీ వంటవ? నీ వంటవ?

రెండున్నర జిల్లాలదె
దండిబాస అని అంటవ?
తక్కినోళ్ళ నోళ్ళ యాస
త్రొక్కి పెట్టవలెనంటవ?

‘బాలానందము’ కోస్తా
బాలల ఆనందానికా?
‘సిల్సిలాగ’ పెట్టిన్నని
సిబ్బందిలో ఒకడంటె
ఆంధ్రోళ్ళన్నది వింటె
అగ్గై పోదువు నీవును
ఇక్కడంత తుర్కమ్మని
ఇంగ్లీషులో అఘోరించు
ఆంగ్లాంధ్రుల? సమ
గ్రాంధ్ర సభ్యత సంరక్షకులు.

తెలంగాణ ప్రాంతమందు
'తెలుగు తనము' మృగ్యంబని
తెలంగాణ రిక్షన్నలు
తెలియక ఆంధ్రమ్మ తోడ
'చారాన' 'ఛెయ్యాన'ల
'ఫేరు రేటు' అంటాన్రని
ఆంధ్రప్రదేశ్ రాజ్యావతరణ
ఆనందోత్సవ మందున
నాట్య సంఘాయోజిత
నట కవి గాయక సభల
నిరుడు అయిదు నెల్లకింద
నిండిన 'రవీంద్ర భారతి'
నిండవున్న ఆంధ్రన్నల
--
కుండ పగిలినట్లు నవ్వ
తెలంగాణ వీరులంత
తలలు వంచుకొని ఏడ్వగ
అన్నది నీ పెరుగుదువా

'ఆంధ్రమైన' వచనకవిత
తెలంగాణ 'బాలామణి'
తొలి జవ్వన వయ్యారము
'చుడీదార్ పాజామా'
తొడిగి నడిచి పోతొందట

అబిదు సర్కల్ పొంట
ఆనాడే ఆ సభసే
ఆంధ్ర మహాకవి ఒకడు
అహంకారమున పలికె
ఆంధ్రన్నలు ఇగిలింపగ
అవమానముచేత మండి
తెలంగాణము కోపింపగ
తెలిసిందా రావన్న.

బాస పేర 'సాలెగూడు'
భద్రమనకు రావన్న!

పన్నెండేడుల ఆంధ్రుల
ప్రగల్భాలు ప్రలాపాలు
తెలంగాణను ఆంధ్రను
కలిపిన కుట్లన్ని త్రెంపి
మనుషులను మనసులను
తునకలు జేసేసినాయి
అతకదింక 'కుండ' పగిలె
అతకదింక రావన్నా

తెలంగాణ పేరైతె
వీర తెలంగాణానికి
కొదవేమిటి వంకేమిటి
నీమదిగల శంకేమిటి?

పెత్తన్‌దారుల సెదుర

సత్తువ లోపిస్తుందా?

ముతాకోర్ల పట్టి తన్ను

'ముల్కి' శక్తి నశిస్తుదా?

తెలంగాణ కామరేడ్లు

బలము కోలుపోతారా?

సీమల గీతలు మారితె

చీమల గతి మారుతుందా?

కుండలు పేరైనంతసె

తిండి సరుకు మారుతుందా?

తొమ్మిది జిల్లాలలో

తెనుగు తనము పోతుందా?

తొమ్మిది జిల్లాలలో

'కొడవ'లాడ నంటుందా?

తొమ్మిది జిల్లాలలో

'సుత్తె' మొట్టనంటుందా?

తొమ్మిది జిల్లాలలో

'రక్తవర్ణ' మే మారునా?

తొమ్మిది జిల్లాలలో

''మార్క్స'' మార్కు మారుద్దా?

తొమ్మిది జిల్లాలలో

బాస మాసిపోతుందా?

తొమ్మిది జిల్లాలలో

పనిపాటలు పేరౌతాయ?

తెలంగాణ పేరైతే

కామరేడ్ల కేమైతది?

తెలంగాణ పేరైతే

కూలి నాలికేమైతది?

తెలంగాణ పేరైతే

కర్రుదుంప కేమైతది?

తెలంగాణ పేరైతే

కూలి నాలికేమైతది?

తెలంగాణ పేరైతే

కర్రుదుంప కేమైతది?

ఆంధ్రప్రదేశ్ రాజ్యము పేరట

జరిగిన అన్యాయాలకు

--

జ్ఞాపకాల చిహ్నాంగా

ఆంధ్రప్రదేశ్ నిలిచి ఉండాలా?

తెలంగాణ పేరైతే

తీరిపోవు ప్రశ్నలన్ని

మోసగాళ్ళ పొత్తు పోతె

నీ కెందుకింత దిగులు?

తెలంగాణమున కూడా

దొంగలుంటె వార్ని మళ్ళీ

ఎదిరించి బుద్ధిచెప్ప

వీరులు తెలంగాణ ప్రజలు

ఆంధ్ర బూర్జువాల
హామి ఆసరాలు కోలు
పోయి కోరలు దీసిన
పాముల కోరలు మళ్ళీ
వస్తే, కోరలూడదీయ
వెనుకాడెదరా మన వీరులు?

వీర తెలంగాణ ప్రజలు
వీర తెలంగాణ సమర
వీరాగ్రేసర రావి: ఆంధ్ర
మహాజభల మేటి ''ప్రజల
మనిషి'' ప్రాణసఖుడ.
నారాయణ నారాయణ
తీరా యీనాడు నీవు
ఏమిటి మాట్లాడునది?
ఏ ఘరాన పాట యిదీ?

## ఊరా? అడవా?

రాజీ కుదరని పాజీ
మాజీ భావుల మధ్య
తాజా ప్రస్తుతాల వస్తు
నాజీ వర్తనులు మస్తు.

ప్రజాస్వామ్య రాజ్యాంగము
పార్టీముఠాల అధీనము
ప్రజస్వామ్యమున వేలము
పాట బడితేపాలు ఓట్లు

ప్రజస్వామ్యమున నేతల
మజా దీర్చుటకు సీట్లు
చట్టాలు చుట్టాలై మెలగురీతి
చట్టబద్ధులకు ఎక్కడలేని భీతి

తెల్లఖాది మేలి ముసుగు
నల్ల బజార్
నల్లజెండా చూపిస్తే నక్కులిరుగు
పార్టీవ్రతము పడుపు విందు మజా
పనిలేని కాడెద్దులు బలిసి తిరుగ
ఓట్లు సక్రమంగా వాడు జాడలేదు
షాట్ల ప్రయత్నం ఏమో చూడలేదు.

## పూలు చెప్పులు

మూడున్నర కోట్ల మేలు
ముందు చూపు వున్నోడే
ముఖ్యమంత్రి : వానికి మన
పూల మాల జోహారులు.

ముఖ్యమంత్రి పదవి జేరి
ముతాకోరు అయినోనికి
మెడలో చెప్పుల పేరు
నడి వీధిలో ఛీ థూలు.

ఉపవాసము చేసినోణ్ణి
ఉరిపోసుక చస్తాండని
చాలాను చేయించే
'చాల్బాజీ' ముఖ్యమంత్రి

నల్ల జెండా జూపినోణ్ణి
పక్కలిరగ తన్నించే
నక్క నల్లి, తోడేలు
ఫక్కి జీవా? ముఖ్యమంత్రి?

పన్నెండేడులు హక్కుల
ప్రక్కతోవ పట్టించి
ఏగోలంఇగిలింతల
దగాకోరా? ముఖ్యమంత్రి?

ప్రత్యేక తెలంగాణ
రాజ్యము కోరుట సైతం
భారతదేశ సమైక్యత
భంగమనుట ఏ విజ్ఞత?

తెలంగాణ ప్రత్యేకత
తెంగాణ పేరు ఉనికి

--

ఫజల్ అలీ కమీషను
ప్రజాక్షేమ దృష్టికాద?

హామీ ఒప్పందాల
డ్రామా ఆడకపోతే
ఆంధ్రప్రదేశ్ రాజ్యస్థాపన
అసలు జరిగి వుండేదా?

హామీ ఒప్పందాల
అమలు సున్న అయినపుడు
తెలంగాణ పేరైతే
దేశము పాడౌతుందా?

నీలము సంజీవరెడ్డి
శీలానికి ఇది పరీక్ష
కొండా రంగారెడ్డి
దండితనానికి సవాలు.

భారత రాజ్యాంగంలో
ప్రజాహితము కొలత రీతి
'నా గొడవ'ను నాడు నేడు
నడిపిస్తున్న అభీతి

పార్టీ దేశము అనుకొను
ప్రజ్ఞయె దేశద్రోహము
ముతాదే రాజ్యమ్మను
మూర్ఖులు దేశద్రోహులు.

## నలుబద్దైదు సంతకాల నటుడా?

నా నోటికాడి బుక్కను
నాణ్యంగా కాజేసిన
నాగరికుడా? విను?

నా నాగటి చాలులోన
నాజూకుగ పవ్వళించి
నను కాటేసిన
నాగరికుడా విను?

నావారల చేరదీసి
నానా విధ బోధలతో
నాణ్యంగా నన్ను కొరిగి
నలుబద్దైదు సంతకాల
నాటకమాడిన నటుడా
నాగరికుడా విను!

కోటిన్నర మేటి ప్రజల
గొంతొక్కటి గొడవొక్కటి
తెలంగాణ వెలిసి నిలిచి
ఫలించాలె భారతాన
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్ :

## అల్లుళ్ల ఆధిపత్యము

మధ్యయుగం భూమీశుల
మాదిరిగా ఈ నాడును
అల్లుళ్లు అధినేతలగుచు
అనదల ఓట్లన్ని దోచి
రాజ్యాంగం సూత్రాలను
లాంఛనప్రాయము చేసి
అధికారము చేతబూని
అన్యాయం జేస్తుంటే
అడిగే నాధుడు లేడా?
బడితున్నోనిదె బర్రా?

ప్రజాస్వామ్య సిద్ధాంతము
పైన నమ్మకములేని
ముఠాబంది స్వార్ధపరులు
మొక్కుబళ్ళు తీర్చుందుకు

ప్రజాస్వామ్య రాజ్యాంగం
రాతియుగం అమలు తీరా?

కోటిన్నర మేటిప్రజల
గొంతొక్కటి గోడెక్కటి
తెలంగాణ వెలిసి నిలిపి
ఫలించాలె భారతాన
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## ప్రధానమంత్రి ప్రకటన

''ఫిర్దోసీ'' చచ్చినాక
గజ్ని మహమూద్ కానుక
ఎందుకమ్మా? ఎందుకమ్మా?
ఏ పీనుగు శోభకమ్మ?

ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ!
ప్రకటన ఎందులకమ్మ?
రక్షణ ఒప్పందాల
రక్షణ యిపుడానమ్మ?

అస్తిత్వము మాసినాక
అమృతమెందుకు తల్లీ?
ఆంధ్రప్రదేశము రాజ్యము

అయినది తునకలు అమ్మ.

మూడుముళ్ళు తెగిపోయెను
మూడునాడులిపుడమ్మా.
పన్నెండేడుల పొత్తూ
పాడైపోయింది తల్లి.

చేటుగూరినోళ్ళ పొత్తు
చేయము ఇకమీదటమ్మ
పార్టీ పేరు ప్రతిష్ఠకు
ప్రాంతము బలి పెట్టకమ్మ.

కోటిన్నర ప్రజల మేటి
కోర్కె యిపుడుపేరమ్మ.
పేర్పాటు తప్ప యిపుడు
పేరుమాట లేదమ్మా

తెలంగాణ పేర్పాటుకు
తెరుపేర్పడి వుందమ్మా.

రాయలసీమయు పేరుగ
రాణించునొ ఏమోనమ్మా?

కోస్తావారితో వారికి
కుదరదు యికపైనమ్మా.

ఫరూక్ అబ్దుల్లా కలాం నిపేదించి
పద్నాలుగేండ్లయిందమ్మా.

తిరుగ తోడుటేమి లేదు
తీరినదే ప్రశ్నమ్మా?
కేంద్ర ప్రభుత్వం కోర్కె
కీడుగూర్చె మాకమ్మా.

ఒప్పందాలను నమ్మి
ఒప్పకుంది చాలమ్మా.
ఎవరి ప్రాంతమును వారిని
ఏలనియ్యి ఇందిరమ్మ.

పేరు పేరుగ వుంటే
పోరు ఉండబోదమ్మ?
మరో రాజ్యమొకటి భరత
మాతకు బరువానమ్మ?

పడీ పడక పేరుబడుట
చెడుట ఎట్లు అగునమ్మ?
తెగేదాక బిగియిస్తే
తెగును తాడు గదనమ్మ.

ఆంధ్రరాష్ట్ర మన్నదొకటి
అయివున్న దేసాడమ్మా.

తెలంగాణ పేరుపడితె

తీరిపోవు సమస్యమ్మ.

--

తొమ్మిది జిల్లాల పటము

నెమ్మదిగా చూడమ్మా.

క్రొత్త చిక్కులేమి లేవు

కోర్కె పాతదేనమ్మా

మెప్పించిన ఒప్పందమె

తప్పి చచ్చిపోయెనమ్మ

చచ్చిన ఒప్పందమిపుడు

తెచ్చె తెలంగాణమమ్మ

అష్టసూత్ర ప్రణాళిక

అరిష్టాల బాపతమ్మ.

‘తెలంగాణ’ ఏర్పాటే

తెలుగోరికి శుభమమ్మా.

సదురుక మెలిగితె చాలు

కుదిరిపోవు రోగమమ్మ

‘ఫిర్దోసీ’ చచ్చినాక

గజ్నిమహమూద్ కానుక

ఎందుకమ్మ? ఎందుకమ్మ

ఏ పీనుగు శోభకమ్మ?

ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ!

ప్రకటన ఎందులకమ్మ!

భారతమాతకి జై

తెలంగాణ జిందాబాద్

## నిదానము

ఢిల్లీ దర్బారీలకు

పల్లీయుల అలజడంత

ముఠా రాజకీయాల

శఠమని తోచుట సహజము

పార్టీ దేశము అనుకొను

పాటిది వారి నిజాయితి

ముఠాదే రాజ్యమ్మను

శఠము బూనినోరువారు.

పార్టీప్రత్యము, వారిది

పాపము దాచెడి నడవడి

'ప్రజాస్వామ్య రాజ్యాంగం'

ఫక్తు నినాదము వారిది.

కైరానును వెనకేసుక

కాపాడిన భూతాలవి

డి.పి. మిశ్రా శీలము

డిపాజిట్టు పైనాలవి.

సత్తా రాగనె కన్నులు
సెత్తి కెక్కు చూపులు అవి
పెత్తనాలు చలాయించ
కుత్తుక అదిమెడి పనులవి.

జాతిపితకు శతవార్షిక
జయంత్యుత్సవాలా ఇవి?
భారత రాజ్యాంగ మహిమ
బాహాటపు విధులా ఇవి?

## దండి ఉపాయం

మెనుకటికో అమ్మగారు
విచారించి విచారించి
పందిరి చుట్టూర్త మడి
బట్ట ఆర కట్టిందట
కాకర కాయల దొంగ
తాకడు మడి బట్టననుచు.

ఢిల్లీలో ప్రధానమంత్రి నేడు
పల్లీయుల రక్షణకు
కథలో అమ్మగారి వలెనె
కడతాంది మడి బట్టలు

ప్రదేశాల రాజ్యాల పందిళ్ళకు
ప్రదేశాల దొంగలదొరలనడిగి మరీ

అవినీతికి బిరుదుపట్ట
అందుకొన్న హీనహేయ
సన్నాహులు, దురాచార్లు
అధికార దండధరులు
అధమాధమ వర్తనులు
ప్రస్తుతము ప్రధానమంత్రి పిలుపు
పాత్రులగుట దారుణమ్ము.

ప్రజాస్వామ్య రాజ్యాంగము
పాలనగల భారతాన
పట్టపగలు యీ పాపము
చెట్టాపట్టాలాడుట
జాతిపితకు గౌరవమా?
నేత నెహ్రో కాత్మశాంతా?
లాల్‌బహదూర్ మతమా?
రాజ్యాంగం సమ్మతమా?

## పల్కుపల్కు చిలుక పలుకు

పల్కు పల్కు చిలక పల్కు
పార్టీ పంజరాన పల్కు

ముఠామత్తు ఎక్కి పల్కు
శఠము హఠము బూని పల్కు
ప్రధానమంత్రి పల్కు ముఖ్యమంత్రి పల్కు
ప్రజల మాట వినక పల్కు
పలుకు పలుకు కులుకు కులుకు

సిండికేటు ఇండికేటు
చేసినటుల ఆడు పలుకు

ముఠా రాజకీయాల
మురిపెముతో మరీ పలుకు

పార్టీ దేశము అనుకొని
ప్రగల్భాలుకొట్టి పలుకు

ఓట్లు వేసి పంపినోర్ని
షాట్లతొ చంపేసి పల్కు

ఎన్నికలిక జరగొద్దని
ఎగసి ఎగసి పడుచు పల్కు

పదవి ఊడకుండ చూడు
పదవి వీడకుండ పలుకు

# ధర్మసాగర మెండిపోయెను

హామి ఒప్పందాల అమలుకు
వామహస్తము చూపి, ఇప్పుడు
దివ్య హస్తాక్షర సుశోభిత
నవ్యనూతన క్షేమ పత్రము

మర్మ ఘాతకచర్య ఫలితము
ధర్మసాగర మెండిపోయెను.

'అన్న' తనమును ఊతగాగొని
ఉన్నతాసన మందుకొని
ప్రచ్ఛన్న ముష్కర హస్త లాఘవ
సంప్రదాయ శ్రేణి సిద్ధము

మర్మఘాతక చర్య ఫలితము
ధర్మసాగర మెండిపోయెను.

నీతి బాహ్యంబైన మార్గము
రీతి నవలంబించి పదవుల
చేరి పాలన పేరజేసిన
వారి పన్నెండేండ్ల రాజ్యము

మర్మ ఘాతక చర్య ఫలితము
ధర్మసాగర మెండిపోయెను.

# కలదు కలదు

భారత రాజ్యాంగ శక్తి
పౌరుల కాపాడలేదా!
భారత అధ్యక్షునకు
పౌరుల మొర వినబడదా!

రాష్ట్రపతికి దేశ ప్రజల
రక్షించెడిలావు లేదా?
రాష్ట్రపతికి దేశీయుల
రక్షించెడి స్థాయి లేదా?

పార్టీ దేశము అనుకొను
పాపుల దండించలేదా?
ముదాదే రాజ్యమ్మను
మూర్ఖుల నరికట్టలేదా?

కట్టు దిట్టములు వుంటే
చట్టాలు పనిచేయవా?
జట్టులుగా చేరి దోస్తే
పట్టగ పగ్గాలు లేవా?

కలము, బడితె, రూపాయి
కలిసి కుడితె మందు లేదా?

ఎన్నికల్లో గెలిచినోరు
ఏది చేసినను సబబా?

ఎన్నుకొన్న పాపానికె
అన్ని అనుభవించాల్నా
అయిదు ఏండ్లు ప్రభుత్వాల
హంగామా కదుపు లేదా?

శాసనసభ మెప్పంటె
చాల? ప్రజల భక్షింపగ
జనతా సంహారానికి
శాసనసభ మెప్ప చాలా?

జనుల అభీష్టము కాదని
శాసనసభ మనగలదా?
జనతా జనార్ధనునికి
శాసనసభ ఆటంకమా?

ప్రజామతము పాటించని
ప్రతినిధి మాటకు విలువా?
మళ్లీ ఓట్లనాటిదాక
చెల్లద వోటర్లమాట?

సీటు గెలుచుకొనుట ప్రజల
లూటి చేయుటకు చీటా?

అయిదు ఏండ్ల దోపిడికి
అంతరాయమే లేదా?

శాసన సభకూ, ప్రజకు
సంగతి కుదరకపోతే
అయిదే ఏండ్లు 'శాస్తి' వోలె
అనుభవించు 'రాతే' నా?
మధ్యన ప్రజలను కాచే
మందెరగద? రాజ్యాంగం?

ప్రతినిధి వర్గాలు వక్ర
పథము బూని పోతుంటే -
ప్రభుత్వాలు ప్రజల మేలు
పాటించక ఏలుతుంటే : -
ప్రజామతమునకు భిన్నము
ప్రతినిధుల మతమైతే :-
రాష్ట్రపతికి తన సత్తా
ప్రకటించే వనరు లేదా?

ప్రధానమంత్రి, ముఖ్యమంత్రిలు ఏమనుకొని
ప్రవర్తించు చున్నారు?
ప్రభుత్వాలు ఏమనుకొని
ప్రజల నేలుచున్నాయి.

ప్రజల మతము ధిక్కరించు

బలము వారికెవడిచ్చెను?
ఏ ధీమాతోడ వారు
ఈ రీతిగ ఎగురుతాన్రు.

ఈడ్చి బైటపడ లాగే
ఇంగితమును సూచించే
హంగుదారి రాజ్యాంగం
నందుకలదు; రాష్ట్రపతికి
అధికారము కలదు కలదు
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్.

## అభినందనలు

అష్టసూత్ర ప్రణాళిక
అందించిన ప్రధానమంత్రి ప్రతిభ
కభినందన తెలంగాణ
అభినందన పరంపరలు.

తెలంగాణ పేర్పాటును
తేల్చనిది అయితెమానె
అష్టసూత్ర ప్రణాళిక
అందముగ ఋజువు పరిచె.

ఒప్పందాలను చంపిన

గొప్ప ఘరాన వైఖరి
కాడెద్దుల ముద్దెరున్న
బాడుగ వ్యాపార సరళి

చతురమతుల ధీ రీతి
'చాణక్యం' కల్యాణం
గూడుపుఠాణీ పైనం
గుర్తింపగ ఒక్కొక్కటి

అష్టసూత్ర ప్రణాళిక
అందముగా రుజువుపరుచు
బ్రహ్మానందుని అండన
బ్రతుకుచున్న 'ముల్కి' మంత్రి

అష్టకాని కొక్కొక్కటి
అందెను ప్రమాణపత్రము
పన్నెండేడులు ప్రాంతము
బాగోగులు అరయకుండ
ఊరేగిన ఘనత చాటి
పేరు ప్రతిష్ఠలు నిలువ
అష్టకానికొక్కొక్కటి
అందెను ప్రమాణ పత్రము.

ఒప్పందాలను మలిపి
తప్పడు కూతలు కూస్తూ

ప్రాంతాన్ని పాడుజేయు
పన్నాగము 'బాబా'ల
అష్టకాని కొక్కొక్కటి
అందెను ప్రమాణ పత్రము

అష్టసూత్ర ప్రణాళిక
అష్టకానికె అరిష్టము
తెలంగాణ వేర్పాటును
తేల్చనిది అయితే మాసె
ఈ మాత్రము జేసె ప్రధానమంత్రి
అమెకు అభినందనలు.

## పల్లెకు పొయ్యొచ్చినట్లు

కౌటిల్యం రక్కసు తీరు
కరుకు కసాయి మనసు
ముతామనిషి, ముఖ్యమంత్రి
(రాజ్యాంగానికె సిగ్గు)
శతముబూని వర్తిస్తే
రాజ్యము ఎట్లుంటది?
ప్రజలు ఏమౌతురు?

మూడు నాల్గు నెలలబట్టి
మూడు నాడులల్లో బ్రతుకు
ఎట్లున్నది? ముందు బ్రతుకు

ఎట్లుంటది? ఏమైతది?

ఢిల్లికి పొయ్యొచ్చినోళ్ళు
కల్లురిమ్మ హెచ్చినట్లు
కైపెక్కి పల్కుతాండ్రు.

బడాయిల బ్రహ్మన్నా
పాపాల భైరవన్నా,

పేలాల పెంకవోలె
కాలుచున్న ఎండలోన
(సిగము బూనినట్లులేచి)
వేలు - లక్షలాది జనులు
తెలంగాణ జిందాబాద్
భారతమాతకీ జై
జైహింద్ జై తెలంగాణ.

బ్రహ్మన్నా 'డౌను' 'డౌను'
నినాదాలతో తొమ్మిది
జిల్లాలల్లో ఊరేగితె
ఇంటింటి విజేత చేయు
వంటి పరిస్థితి వచ్చి
ఏమి చేయలేక తుదకు
ఏదో నీ ఒదార్పుకు
పోలీసు సిబ్బందికి

‘వీలు’ వున్నంత వరకు
ఊరు పేరు రాసుకొనెడి
ఓర్పుస్థాయి వున్న వరకు
మేజిస్ట్రేటుల సంఖ్య
మేరకు పని గంటలకు
జేళ్ళల్లో ఉన్న ఖాళీ
పూరించే పరిమితికి
సరిపొయ్యేవార్ని పట్టి
తక్కినోళ్ళు వదిలేసి
సత్యాన్ని దాచి నీతో
సిగ్గులేక చెప్పినాడ?

సత్యాగ్రహుల సంఖ్య
వెయ్యికి మించనె లేదని
డి.జి.పి. జయరాముడు
అపర హరిశ్చంద్రునివలె.

ఏమో నీ మాటలు విని
నమ్మ నేను నమ్మడెవడు
ఢిల్లీకి పొయ్యొచ్చి నీవు
పల్లెకు పొయ్యొచ్చినట్లు
కల్లురిమ్మ హెచ్చినట్లు
‘కైపు’తో పల్కుతు వున్నవు
“తెలంగాణ” కడ్డుపడకు

దివానాగ మాటాడకు
బడాయిల బ్రహ్మన్నా!
పాపాల భైరవన్నా!
"జైహింద్, జై తెలంగాణ"
కోటిన్నర ప్రజల కోర్కె,
భారత మాతాకీ జై
తెలంగాణ జిందాబాద్

## అష్టసూత్ర ప్రణాళిక

తెలంగాణ వేర్పాటుకు
తేల్చనిదీ అయితెమాసె
అష్టసూత్ర ప్రణాళిక
అందముగా రుజువుజేయు

పన్నెండేదుల పాలన
ఫలితాంశము నిక్కచ్చిగ
కన్నెపిల్లల అన్నయ్యల
కళ్యాణ లాఘువము

బ్రహ్మానందుని అండన
బ్రతుకుచున్న ముల్కిమంత్రి
అష్టకానికొక్కొక్కటి
అందెను ప్రమాణ పత్రము

పన్నెండేడులు ప్రాంతము
బాగోగులు అరయకుండ
ఊరేగిన ఘనత చాటి
పేరు ప్రతిష్ఠల నిలుప

అష్టకానికొక్కొక్కటి
అందెను ప్రమాణపత్రము

ఒప్పందాలను మరచి
తప్పుడు కూతలు కూస్తూ
ప్రాంతాన్ని పాడుజేయు
పస్నాగపు 'బాబా'ల

అష్టకానికొక్కొక్కటి
అందెను ప్రమాణపత్రము

## ప్రజావాణి

ప్రజావాణి ప్రతినబూని
నిజము వెల్లడిస్తున్నది
ప్రజావాణి ప్రతినబూని
సజా సునాయిస్తున్నది

తెలంగాణ ప్రత్యేకత
తొలి సంజల పూస్తున్నది

ప్రజామతము స్థాయి బలము
బాహాటము జేస్తున్నది

తెలంగాణ బలము జాడ
ఇలకడుపున మెదలుతోంది
ప్రజలశక్తి ప్రజ్వలించి
ప్రభల ప్రసారిస్తున్నది

తెలంగాణ పుట్టి ఎదిగి
బలము జూపదలస్తోంది
ప్రజలరాజ్య ప్రాభవమును
ప్రదర్శింప చేస్తున్నది

'తెలంగాణ' కృష్ణుడివలె
మొలుస్తొంది జేలులోన
బ్రహ్మానందుడు కంసుడు
బలుస్తాండు జేలివతల

కలము బడితె రూపాయి
కలిసిన కసి రాబందువు
పోలీసుల 'రజాకార్ల'
పోలిక జేస్తున్నాడు

రాజ్యమంత 'కాస'య్యల
రాజ్యము అనుకుంటున్నడు

బ్రహ్మానందుని కాసు
'బదనా'మైనది బజార్లో

చెల్లని రూపాయి ఎటుల
చెల్లును వ్యవహారానికి
కాంగ్రెసుదే రాజ్యమ్మని
కానూనేమియులేదు.

కాడెద్దుల ముద్దెరుంటె
కాదు 'చలామణి' కాదు.

'ఫిరంగి' పట్నము బాపతు
దొరతనము చలాయిస్తు
ఆనంద నిలయంలో
హాయి మజా చేస్తున్నప్పుడు
దొంగ ముతాకోర్లజూచి
బెంగపడరు పౌరులెపుడు

బద్మాషుల పట్టితన్న
పహిల్వాన్లు పల్లీయులు
జలియన్ వాలాబాగ్ గ
''తెలంగాణ'' మును జేసి
జనరలు డయ్యరు మాదిరి
ఘనతలొంద దలచినాడు.

సైన్‌టీన్ సిక్స్టీసైను

ఫిరంగి పట్నం కాదిది

వీరతెలంగాణ భూమి

సత్యమేవ జయతి అని

శాసనము ఆదేశము

ధర్మచక్ర ముద్రాంకిత

ధ్వజముక్రింద భారతము

## నిరసన చాటగ చెప్పు

ముఖ్యమంత్రి పదవిధరా?

ముతా మనిషి ఎన్నాళ్ళకు!

ఎన్నాళ్ళకు తెలంగాణ

కన్నులారా చూచుకోర్కె

తెలంగాణ ప్రస్తుత స్థితి

తిరిగిచూచు సద్భావన

ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు!

ఎదమెదడుల మెసలె నీకు

ప్రజాస్వామ్య హంతకుడా!

రా స్థితి కనులార చూడ

ముతా మనిషి ముఖ్యమంత్రి!

కథహరములుగల కుతంత్రి!

రా! మాట నిలువుకొని రా!

రా! బూటకాలు మాని రా!

నిన్ను ఎదుర్కొని కాయగ
ఉన్నారేజంట్లు బంట్లు
పోలీసుల పటాలాలు
బాలీసుల (పరువులు) లాల్చి స్టంట్లు.

తెలంగాణ సంపదను
దిగమింగిన కోస్తోరు
వారందరు కట్టింతురు
తీరుతీరు సింగిణీలు

వారందరి స్వాగతాలు
వాడ వాడలందు నీకు
ప్రత్యేక తెలంగాణా
ప్రతినిష్ఠులు ముల్కీలు
తమ తమ ఇండ్లల్లోజేరి
తలుపులు మూసుక ఉందురు
ప్రజాస్వామ్య హంతకుడా?
రా! స్థితి కనులారా చూడ!

మురుగు టమాటాలైనను
దండుగ చేయము నీకై
పానుషాపు కూడుండదు
పాపోసుల మోతుండదు

రిక్షా తమ్ముడు గుడిసెల
దీక్షబూని నిద్రించును
'సైమను' మాదిరి నీవును
పైరుచేసి పెళ్ళిపొమ్ము!
నీ ప్రాణము తీయరెవరు
నిర్భీతిగా మాత్రము రా!
వచ్చి పెళ్ళి  చూచినట్టి
వాస్తవాలు వెల్లడించు.

గోబెల్సు కూతమాని
నోబుల్‌గా ఒక్కసారి
రా! మా ఊరికె రా! ముందు
రా! రా! హామీగా నేనుందు

ముఖ్యమంత్రి పదవి నీకున్నది
మమత అదను నాకున్నది
మాట నిలువుకొన రా!
బూటకాలు మాని రా!

మరచితి సుమా! ఒక్కమాట
మా నిరసన తెలియచెప్ప
అచ్చటచ్చట ప్రేలాడుచు
ముచ్చటగా పాత చెప్ప
ఉండు సుమా  నీ సిబ్బందిని

ఊడదీయవద్దను! అంతే చాలు
నిశ్చలముగ పాత చెప్ప
నా గొడవిది నేడు రేపు
నాడుకాయ జవవున్నది

జైహింద్ జై తెలంగాణ
తెలంగాణ జిందాబాద్
'రాజపుత్ర' లాంఛనాల
రాణించెడి దాదా! విను
ప్రత్యేక తెలంగాణ
ప్రజాపత్ర ప్రకటన ఇది

## తెలంగాణ పేరైతే

తెలంగాణ పేరైతే
దేశానికి ఆపత్తా?
తెలంగాణ పేరైతే
తెలుగుబాస మరుస్తారా?

తెలంగాణ పేరైతే
కిలోగ్రాము మారుతుందా?
తెలంగాణ పేరైతే
తెలివి తగ్గిపోతుందా?

తెంగాణ పేరైతే
చెలిమితుట్టి పడుతుందా?
వానపడక వుంటుందా?
చెలిమిలెండి పోతాయా?

కులము తగ్గిపోతుందా?
బలము సన్నగిల్లుతుందా?
పండించిన వరికర్రల
గింజరాలనంటుందా?

రూపాయికి పైసాలు
నూరు కాకపోతాయా?
కోర్టు అమలు అధికారము
ఐ.పి.సి. మారుతుందా?

పాకాల, లఖ్నవరం
పారుదలు ఆగుతాయా?
గండిపేటకేమైనా
గండితూటు పడుతుందా?

ప్రాజెక్టులు కట్టుకున్నా
నీరు ఆగనంటుందా?
పోచంపాడు వెలసికూడ

పొలములెండి పోతాయా?

తెలంగాణ పేరైతే
దేశానికి ఆపత్తా?

## కూళ చేతిలో తాళపు చెవులు

రాజ్యాంగం సమకూర్చిన
రహదారుల కడ్డుపడితె
దేబెలకు బడితెబాట
దేవుడేసి పెట్టినదే.

దోపిళ్ళకు 'కానూరు' కు
దోస్తి కుదిరి వెలుస్తుంటె
విసుగెత్తిన వారలంత
వికటవర్తనులె ఔతరు.

అధికారము ఆసరాతో
హంగామా చేస్తుంటే
చాటుమాటు చేష్టలతో
చేటుగూర్చటం తప్పదు

'తాళపు చెవులూ' 'ఖాతా'
'కూళ' చేతిలో వుండగ

రొక్కం తప్పించిలెక్క
'పక్కా' చేస్తే దిక్కుండదు

చేజిక్కిన అధికారము
చేయిజారదనెడు ధీమ
నీతి రీతిలేని వాణ్ణి
నియంతజేసి ఆడించును

'తుచ్ఛబుద్ధి' అయినోనికి
మెచ్చి    అధికారమిస్తే
దుర్వినియోగం చేయక
నిర్వాకం చేస్తాడా?

'ఓటిచ్చేటప్పుడెమన
కుండాలె బుద్ధన్న'ది
ప్రజాస్వామ్య పద్ధతికే
ప్రాణతుల్యమగు మాట

'ఎన్నుకొని తలలు బాదు
కొన్న ఏమి కాద'న్నది
నాల్గుసార్ల ఎన్నికల
నాణ్యమైన అనుభవమ్ము

ఓట్ల బాట లడ్డి దోచి
సీట్లన్నీ కాజేస్తే

(సీట్లను కాజేసినోరె)
షాట్లతో దింపే మార్గము
చదును జేసి పెట్టినట్లే
(''చదునుచేసి పెడ్తున్నరు'')

## కలము బడితె రూపాయి

కలము బడితె రూపాయి
భ్రమలు భయము ఆసక్తి
బద్ధమైన మన ఓట్లు
సిద్ధమైన మన ఓట్లు
కబంధుని చేతుల్లో
కలము బడితె రూపాయి.

కలిసికట్టు వ్యాపారము
గొలుసుకట్టు వ్యవహారము
సులువుగ సాగిస్తున్నయి.
కలము బడితె రూపాయి.

కొలువుదీరి కూర్చున్నయి
కలిసి మనల దోస్తున్నయ్
కలము బడితె రూపాయి

కసిగ మనల చూస్తున్నయి

మసిగ మనల చేస్తున్నయి
కసాయికోత కోస్తున్నాయ్
కాలనేసి రాస్తున్నయ్
కలము    బడితె    రూపాయి.

వలలు పన్ని పడుతున్నయి
భయము చెంద చేస్తున్నయ్
ధరలు గట్టి కొంటున్నయ్
కబంధుని చేతుల్లో
కలము బడితె రూపాయి.

కలసికట్టు వ్యాపారము
గొలుసుకట్టు వ్యవహారము
సుళువుగ సాగిస్తున్నయి
కలము బడితె రూపాయి
ఎన్నికలొచ్చే దాకా
ఏలుతాము అంటున్నయి
గద్దె దిగండని అడుగుతె
ముద్దుగ ఇగిలిస్తున్నయ్

ఓటు వేసినపుడె బుద్ధి
ఉండొద్దా అంటున్నయ్
మళ్ళీ ఓట్లనాడు మనల
మళ్ళీ చూస్తుమంటున్నయి

అందాకా మా అదుపులో
ఎందుకుండరంటున్నయి
చు చా అంటే జేలు
చూపిస్తమంటున్నయి

అయిదుగురొకచో చేరితో
ఖైదు చేస్తమంటున్నయ్ (144 సెక్షన్)
ఎన్నుకున్న ప్రతినిధులు
అన్నదై రైటంటున్నయ్

ప్రతినిధులు చేసిందే
ప్రజాస్వామ్య మంటున్నయ్
విశ్వాసం లేదంటే
వెర్రికూతలంటున్నయ్

తెలంగాణ పేరంటె
తెలివి లెక్క బెడుతున్నె
ఇంత జరుగుతుంటె
అంత ఓరుస్తూ కూర్చున్న
మనమెవరము?
మనమెవరము?
పౌరులమా?
పురుగులమా?

# ప్రత్యేక తెలంగాణము దక్షిణ పాకిస్తానము

అంటాడొక మహాకవి
పాపము శమించుగాక
తెంగాణ పేర్పాటు
'ఆత్మహత్య సదృశమ్ము'
అంటాడు ముఖ్యమంత్రి 'పేది'

రోకలి తలపాగచుట్టి
ప్రదేశములో పెలయుచున్న
పార్టీలు - పేర్పాటుకు వ్యతిరేకము
('పార్టీ ప్రత్యము' వారిది)
కాబట్టి
ప్రత్యేక తెలంగాణ
ప్రశ్నే లేదంటున్నది
ప్రధానమంత్రి 'శ్రీమతి గాంధీ'
నెహ్రూ గారాబాల బిడ్డ
'ఇందిరా ప్రియదర్శిని'

ప్రదేశాన పెలయుచున్న
పార్టీలంటే ప్రధానమంత్రికి
ఇంతపాటి ఆదరణ
ఎన్నాళ్ళకు? ఎన్నాళ్ళకు?

పప్పాపంపిన లేఖలు
ప్రకటించిన రూపకాలు
ప్రపంచేతిహాసఘటలు
మరుస్తోంది వీలుబట్టి
ప్రధానమంత్రి పదవి శాశ్వతమని
ప్రలోభాల పడుతున్నది
ముఠాబంది బందీగ
ముచ్చట్లు చెప్తున్నది
ఒకేనాడు ఒకేజట్టు
వివాదాన శ్రద్ధబూని
పార్టీ దేశము అనుకొని
ప్రమాదాలు తెస్తున్నది.

ప్రజాస్వామ్య లక్షణాలు
పాటించక మసలుతాంది
ఆంధ్ర ముఖ్యమంత్రి బెదిరిస్తే
హడలిపడి లొంగుతాంది

కేంద్రమంత్రి మండలిలో
'కేబినేటు రాంకు' శోభ
కాడెద్దుల ముద్దెరున్న
ఏ.పి. యం.పి. లల్లో
ఇద్దరికైనా తప్పక
ఇవ్వకుంటే చూడండి

అంటడు బ్రహ్మానందుడు
ముతాబంది దాదావలె
ముఖ్యమంత్రి అతడు సిగ్గుచేటు

ప్రజాస్వామ్య రాజ్యాంగం
పటాపంచలై పోగా
ఏ సూత్రము ననుసరించి?
ఏ సభ్యత ననుసరించి?

కేంద్రమంత్రి మండలిలో
కాడెద్దుల ముద్దెరున్న
ఏ.పి. యం.పి. లల్లో
ఇద్దరైనా లేకుంటే
ప్రదేశానికి న్యాయం
జరగదన్న ఆరోపణ
చేస్తున్నాడు బ్రహ్మానందుడు
ప్రజాస్వామ్య రాజ్యాంగం
ఏ సూత్రం ననుసరించి?

కేంద్రమంతి మండలిలో సెరిసి, పూజలందుచున్న
మహామహులు, మహనీయులు
యావద్భారత మంగళ
మాశించక ప్రాంతపక్ష
పాతబుద్ధి పాతనుబడి మెలుగుచున్న వారనుట-
అనుకొనుటకు వీలిచ్చుట

ప్రజాస్వామ్య రాజ్యాంగం
వ్యభిచారము అవున కాద?
ప్రదేశములో పార్టీలు
(కాడెద్దుల గుర్తు మినహా)
బ్రహ్మానందుడు పెబ్బగ
నడుపుతున్న ప్రభుత్వాన్ని
'శాంతి భద్రతలు రక్షణ'
చేయలేదు లేదనుచు
ప్రాంతంవారీ రక్షణ
చేయలేదు లేదనుచు
న్యాయమైన పరిపాలన
చేయలేదు లేదనుచు
ప్రజాస్వామ్య దృష్టిగలిగి
మెలగలేదు లేదనుచు
ప్రజాస్వామ్య దృష్టిగలిగి
మెలగలేదు లేదనుచు
ఒక్క క్షణం గద్దెనుండ
వీలులేదు లేదనుచు
చేసిన తీర్మానాలు
శాసన సభలో ప్రవేశ
పెట్టిన అవిశ్వాస తీర్మానాలు చాలనలు
లెక్కపెట్ట పేమమ్మా?

ఆంధ్రప్రదేశ్ రాజ్యము ఏర్పడి
పుష్కరమ్ము దాటినాక
నిన్నకాక మొన్ననెకద
'పెండ్లి పిలుపు' పేర ప్రధానమంత్రి
ఏడుకొండలెక్కి నిలిచి
తెలంగాణ ప్రజల ఏడ్పు
తీరికగా ఆలకించి
బ్రహ్మానందుని పిలిచి
నిలువదీసి అడిగిందట
''తెలంగాణ మునుపటివలె
వెనుకబడిన దుస్థితిలో
ఎందుకుంది ఎందుకుందిజీ''

వినినంతనే వేగిరపడి
ముఖ్యమంత్రి బ్రహ్మానందుడు
''తెలిసె తెలిసె ఇపుడు తెలిసె
తెలంగాణ వెనుకబడిన
దుస్థితిలో వున్నమాట
ప్రధానమంత్రి తెలుప తెలిసెనాకు
ఇకనుండి తప్పకుండ
ఆంధ్రప్రదేశ్ రాజ్య విధానము
తెలంగాణ అభివృద్ధికె
అనుగుణముగ జరుగును'' అనె.

ఎంత దూర దృష్టి, దయ?

ఎంత నిజాయితి, సత్యము?

ఎంత అమాయకత, మమత?

ఎంత రాజనీతిజ్ఞత, సమత?

## ముఖ్యమంత్రి – సిగ్గుచేటు

రాజ్యాల విభజనకు

రాజ్యాంగం ఒప్పన్నది

రాజ్యాల విభజనకు

ప్రధా రీతి నీతున్నది.

రాజ్యాల విభజనకు

ప్రజల మనసు మెప్పన్నది

రాజ్యాల విభజనకు

లక్షణంగ సిద్ధున్నది

రాజ్యాల విభజనకు

ప్రజాశక్తి జాడున్నది

రాజ్యాల విభజనకు

పార్లమెంటు మెప్పన్నది

అలనాటి ప్రధానమంత్రి నెహ్రో

అంగీకారము వున్నది

అలనాటి ముఖ్యమంత్రి గార్ల

అంగీకారము వున్నది

అప్పటి అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు
అంగీకారము వున్నది
అప్పటి నిజలింగప్పల
అంగీకారము వున్నది
రాజ్యాలను విభజిస్తే
భారత సమైక్యతకు
భంగము వాటిల్లుననెడి
వాడు అబద్ధాలకోరు
ప్రజల మోసపుచ్చువాడు
ముతాబలము రాబందువు
రాజ్యాల విభజనకు
రాజీపడి 'ఫజల్ ఆలీ'
కమీషన్ను ఏర్పరచిన
ఘరాన ఘనత మరచి
కేంద్ర ప్రభుత్వం నేడు
కేరింతలు కొడుతున్నది

## నిర్వాకం

నమ్ముకొని పెత్తనము ఇస్తే
నమ్మకము పోగొట్టుకొంటివి.
కుప్పకావలి ఉండి కట్టలు
తప్పదీస్తివి ముద్దెరేస్తివి

సాటివాడని చేరదీస్తే
నోటినిండా మన్ను గొట్టివి
పదవి అధికారముల బూని
పదిలముగ తల బోడి జేస్తివి
దాపునకు రానిస్తె చనువుగ
టోపి పెడితివి లాభపడితివి
అన్నపై తమ్ముళ్ళ తలలను
నున్న జేస్తివి మురియబడితివి
తొత్తులను చుట్టూరజేర్చుక
పెత్తనాలు చేయబడితివి
'పోచంపాడు' పథకము
కూచికూచి చేసేస్తివి
'దొంగ ముల్కి' సనదులిచ్చి
దొరతనమ్ము వెలిగిస్తివి.
తమ్ములను ఇన్నాళ్ళబట్టి
వమ్ముజేస్తివి తిన్నగుంటివి
ఎన్నిసార్లు మొత్తుకున్నను
అన్నవయ్యును గమ్మనుంటివి
అన్న అధికారమునకు తగిన
న్యాయబుద్ధిని కోలుపోతివి
చిలిపి చేష్టలు చేసి ఇప్పుడు
చిలుక పలుకులు పలుకుచుంటివి

# ఎవరనుకొన్నారు? ఇట్లౌనని ఎవరనుకొన్నారు?

ఎవరనుకున్నారు ఇట్లౌనని ఎవరనుకున్నారు,
ఆంధ్ర తెలంగాణలకు అన్యత ఏర్పడుతుందని
హామీలిచ్చినవారే అంత స్వాహా చేస్తారని ||ఎవర||
అన్నలు ఒప్పందానికి సున్నా చుట్టేస్తారని
పరిపాలనతో తమ్ముల 'ఫజీత' పాలు చేస్తారని ||ఎవర||
ముఖ్యమంత్రియే స్వయముగ సఖ్యత ఛేదిస్తాడని
ప్రాంతీయాధ్యక్షుండు ప్రక్క తాళమేస్తాడని ||ఎవర||
'కావలి కుక్కలు' దొంగల గంజికాసపడతాయని
కావలివాడే దొంగల కావళ్లను మోస్తాడని ||ఎవర||
సిబ్బందిలోగల తమ్ముల ఇబ్బంది పెడతారని
అన్నలమను మాట మరచి అహంకార పడతారని ||ఎవర||
తమ్ముని తల బోడిచేసి దక్షత అనుకుంటారని
తంతే-తమ్ముడు అన్నను తన్నిండని అంటారని ||ఎవర||
తప్పుడు లెక్కతొ తమ్ముల నెప్పుడు ఒప్పిస్తారని
అంకెల గారడి చేస్తూ చంకలు ఎగిరేస్తారని ||ఎవర||
పోచంపాడు, శకుని పాచిక పాలౌతుందని
తెలంగాణవాసులకు త్రిశంకుస్థాయి వస్తుందని ||ఎవర||
ప్రాంతాన్ని పాడుచేసి శాంతి శాంతి అంటారని
కడుపుల్లో చిచ్చుపెట్టి కళ్ళు తుడువ వస్తారని ||ఎవర||
అధికార ప్రకటనలో అబద్ధాలె ఉంటాయని
బాధ్యతగల మంత్రికూడ బాతాలే కొడతాడని ||ఎవర||

మంత్రి అయిన మురిపెముతో మనిషి దయ్యమౌతాడని
ప్రజాస్వామ్య విధానాన్ని బదనాము చేస్తాడని ||ఎవర||
ఓట్లు పొంది సీటు దొరక నోట్ల మన్ను పోస్తాడని
నమ్మకద్రోహం చేస్తూ గమ్మున కూర్చుంటాడని ||ఎవర||
ప్రజాస్వామ్యమీ తీరుగ పాడుచేయబడుతుందని
శాసనసభ వుండికూడ మోసమె సాగిస్తారని ||ఎవర||
విశాలాంధ్రులను సైతము విషాదులను చేస్తారని
తెలంగాణ పేర్పాటుకు తీరులు కల్పిస్తారని ||ఎవర||
తీరవాసులైనంతనె తీర్థంకరులౌతారని
తెలంగాణ వాసులను దేభ్యాలుగ చూస్తారని ||ఎవర||
అభయమిచ్చి కుత్తుకసే అదిమి అదిమి పడతారని
ఆక్రోశిస్తే శాంతికి అంతరాయమంటారని ||ఎవర||
తెలంగాణ పేరంటె తెలివి లెక్క పెడతారని
ఆత్మహత్య ధోరణంచు హంగామా చేస్తారని ||ఎవర||
'ముల్కి' మంత్రులందరును ముఖ్యమంత్రి భజన చేస్తారని
దొడ్డిదారి పదవులతో దొడ్డవారు అవుతారని ||ఎవర||
ప్రతినిధులు ప్రజల మరచి పదవిపథము పడతారని
బ్రహ్మానందునిపదమున బ్రహ్మపదముకంటారని ||ఎవర||
విచ్చలవిడి ఖర్చులతో విలాసాలు చేస్తారని
కేంద్రంపై నిందమోపి కేరింతలు కొడతారని ||ఎవర||
బార్డరువీరులు ద్రోహుల ఆర్డరు పాటిస్తారని
చేటుగూర్చినోనికి తమ ఓట్లు అందజేస్తారని ||ఎవర||
చేతకు సిద్ధాంతానికి చీమ ఏన్గు తేడాయని
వట సావిత్రి వ్రతమును వారకాంత చేస్తుందని

ఎవరనుకొన్నారు ఇట్లౌనని ఎవరనుకున్నారు